శ్రీరస్తు.

# పితృపూజ

సీ॥ శ్రీకరంబుగ భవ్య చిట్టాన్వయంబునఁ
గలికి తొల్కారిగ నన్గాంచి పెంచి
తెలిముద్దు పల్కరింపుల దొంతరల నన్ను
జలకంబులాడించి పులకరించి
కొమరులు మువ్వురు కూతులిర్వురుగల్గ
వరలి యుద్యోగవైభవము లరసి
పను దీర్చి దిద్ది తీయని దీవనలను వి
ద్యను గూర్చి పట్టభద్రుని నొనర్చి.

గీ॥ తనువుఁదాల్చిన మా వేల్పులనఁగ నొప్పు
నాత్మజనకుండు నాగేశ్వరార్యవరున
కాత్మజనని లక్ష్మీనరసాంబ కెరఁగి,
యంకమున జేర్తు నీబిడ్డ నంకితముగ॥

ఉ॥ ఎన్నఁడు వేడిమాటనాడని దెవ్వని నాలుక నింట, బైటఁ బె
రెన్నికఁ గాంచె ముప్పదియునేడులు స్టేషను మాస్టరై బుధుల్
మన్నన ధర్మరాజనుచు మాన్యుడు శాంత గభీరమూర్తి యుం
చెన్నఁగఁ గావిగట్టని యతీంద్రుఁడు గానియతీంద్రుఁ డౌచుఁ దాఁ
బన్నుగ మైనిలీజనకుఁ బద్ధతి మా జనకుండు నొప్పెడున్ ॥

ఉ॥ ఎవ్వరికెతల్లు లెట్లొ కన నేటికి! మాదగు మాతృదేవి మే
మెవ్విధి నెన్ని పుణ్యముల నేర్పడ సల్పఁగ మాకుఁగల్గెనో!
ఎవ్వరికైన బిడ్డలన నింతటి కూర్మియె! పెట్టుపోతలం
దెవ్వరు సాటిరాదురన నెప్పుడు నొప్పెడు సార్థకాఖ్యయై!
ఇవ్వసుధాస్థలిన్ దనకు నెంచఁగ బిడ్డలె పంచప్రాణముల్!

# పీఠిక

నేని చిన్నికబ్బమున సంఘాభివృద్ధి కనుయుక్తముగ దోచు విధానముల గొన్నింటిని కథారూపమున పొందుపరచితిని. మానవాభ్యుదయ పరంపరాభివృద్ధికై కాలానుకూలము లగు రాజకీయపరివర్తన లెంతయావశ్యకములో, సాంఘిక పరిణామములును నంతయావశ్యకములే కావచ్చును.

ఇందలి కథావిధానము కేవలము కల్పితము. ఇందు ప్రత్యేకవ్యక్తుల పరామర్శ యేమాత్రమును లేదు. సంఘోన్నతియే ప్రధానపరమావధిగ నిది రచింపబడినదిగాని దూషణ విమర్శలకుకాదు.

ఇందు భాషకంటె నభిప్రాయములు ప్రధానములు. ఎడనెడ ప్రధానాంశములు సులభగ్రాహ్యములై గానయోగ్యము లగునట్లు పద్యరూపమున వెలువరింపబడినవి. నా యాశయము లేశించినమాత్రము ఫలించినను ధన్యుడనగుదును.

ఈ రెండవ ముద్రణమున నాకెంతయు సహాయభూతులైన 'శ్రీలక్ష్మిప్రెస్' యజమానులకు నా కృతజ్ఞతాభివందనములు.

ఇట్లు,

మచిలీపట్టణము,
*6-1-1958.*

**చిట్టా రామకృష్ణరావు,**
జై హింద్ సెకండరీ స్కూలు.

పుత్రకళత్రాదుల పోషించుకొనుచున్నారు. ఆతని నీడల మెలగుటం జేసియే వెలయాండ్రు సైతము తమ వృత్తికి తిలోదకము లర్పించి ఆయురారోగ్య భాగ్యము లనుభవించు చున్నారు. పశుబలి, కన్యాశుల్కము, వరదక్షిణ, లోనగు పెక్కు దురాచారము లాతని నిరంతర నిరోధముననే యంతరింపజొచ్చెను. ఒకపరి యాతడు పామరజన విద్యాప్రచారము నిమిత్తము పరిశ్రమ చేయుచుండెడివాడు. మరియొకపరి గ్రంథాలయాభివృద్ధికై పాటుబడుచు విజ్ఞానచంద్రికల ప్రసరింపజేయువాడు. అంటరానివారిని సహితము తనవెంట నిడుకొని తత్పురోభివృద్ధికై పనిచేయుచుండెడివాడు. నిక్కముగ నా జనుల కితడు హరియే. మరియు భిన్నమతముల నీసుగొనక నెల్లమతముల నొక సమతను తీసికొనిరాసతడు నడుముకట్టుకొనుచుండెను. ఇట్టి యున్నతాశయములు గల వ్యక్తిని గన్న రాజమండ్రి రాణింపకున్నే ?

నేనుద్యోగమువలన బెజవాడ వచ్చిచేరినపిదప నాలు గేండ్లకు మరల నా మహాశయుని వాల్తేరుబండిలో జూచి సంతసించితిని. వెంటనే నా వినిన యాతని యుపన్యాస ధోరణియు గంభీర భావములును స్మరణకు రాగ నా పురుష పుంగవుని—

'లోకములో నాకెవ్వరియందును ద్వేషములేదు,
అన్యాయమును అక్రమమును జూచి సహింపజాలను.'

అను నాతని పల్కులతో జపియించితిని. అంత నా కాయమాపాదమస్తక మొక్కమారు పులకరించెను. తొలి పలుకులబోలు పైనుడువుల నా పరమవ్యక్తిని ధ్యానించి,

దర్శించి, నా జీవితము ధన్యత జెందినది. ఆత డా పెట్టెయందు నా మోకాల నెదుటి బల్లపై నాసీనుడై యేదో వార్తాపత్రిక జదువుచుండెను. బెజవాడ స్టేషనులో ప్రయాణీకుల యొత్తిడి చెప్పవలయునా? దిగువారికి నెక్కువారికి విధి విరామములు లేకుండెను. అప్పుడు మా పెట్టెలోనివారి పలుకులు విచిత్రముగ నుంటచే స్మృతిపథమునకు రాకుండినవి కావు.

1వ ప్రయాణీకుడు:— ఏమయ్యో, ఓ పడుకున్నాయనా, లే కొంచెం, కూర్చోటానికే స్థలం లేకపోతే పడుకున్నావు, మహా చక్కగా!

2వ ప్రయా:— లేవనయ్యా, మాట్లాడవేం? చెప్పేది నీకు కానటయ్యా?

3వ ప్రయా:— కొంచెం జరగండి బాబు! కూసేపు పోతుంటే మా స్టేశనొత్తుంది దిగిపోతాను.

4వ ప్రయా:— సామానును మెల్లమెల్లగా నా మీదవేసి తోస్తున్నావేమయ్యా? పైన బల్లమీద పెట్టుకోరాదూ, అంత స్థలముందిగా!

5వ ప్రయా:— ఏమిటయ్యో అక్కడకూర్చున్నావు! అక్కడ ఉన్నవాళ్ళకే స్థలంచాలలేదుగదా!

2వ ప్రయా:— ఏం కూర్చుంటే? ఇంకెక్కడ కెళ్ళమంటావయ్యా? మొగవాళ్ళ బండిలో యెవరెక్కమన్నారు వాళ్ళను?

ఇందలి సంభాషణ సాధారణముగ నున్ననూ అందలి వివిధ ప్రవృత్తులు మరువరానివి. వారి వాగ్వివాదములు ముగియకమున్నె, పదుగిడలేక దక్షిణ హస్తమున నుదుటి బిందు

వుల దుడిచికొనుచు, నెంచేని స్థలమున్న పెట్టెలోనికి దూర నాతురుడై యున్న యొక వ్యక్తిని 'లక్ష్మయ్యగారూ, లోనికి రండి' అని శ్రీధరరా వాహ్వానించెను. కాకతాళీయ న్యాయమున నా పెట్టెలోని కాతని ప్రవేశమును బండి కదలుటయు నొక్కతూరి జరిగినవి. అందును అది మేలుబండి. త్రుటి కాలములోనే మేడలు వాడలు తరులు గిరులు వెనుకకు పరుగిడుచు మాకు కన్పట్టకపోయెను. ఈ నూతనవ్యక్తి రావుగారి కెదుటిబల్లమీద స్థలము గావించుకొని కూర్చుండెను. ఉత్తరీయమున తన మోము విసరికొనుచు, 'ఇస్, అబ్బా, రెండు నెలల కివ్వాళ్ళ కాస్త తీరికగా కూర్చోటానికి వీలయిందండీ' అని శ్రీధరరావుతో విన్నవించెను.

శ్రీధరరావు:- ఏం?

లక్ష్మయ్య:- మీకు తెలియదా యేమిటి?

శ్రీధర:- తెలియదే! దావా యేమన్నానా?

లక్ష్మ:- కాదు.

శ్రీధర:- మరి? అన్నట్టు యెలెక్షనులా?

లక్ష్మ:- ఆఁ, అవే. యేమి యెలక్షనులోగాని యీసారి మా అంతుకనుక్కున్నాయండి. ఇదివర కెన్నడు దిగనివాళ్లం యీమాటు యీ మునిసిపల్ యెలక్షనుల గొడవలో పడి నానావిధాల నలిగిపోయాం.

శ్రీ:- అయితే చివర కేమయింది?

ల:- ఆసంగతింకా చెప్పాలనాండీ? ఎదురుపార్టీ నెంబరే గెలిచారు.

శ్రీ:- అవునులేండి. ఈకాలంలో ఓటర్లు ఎంతో మారిపోయారు.

ల:- అవును. మా విషయంలో కూడ అదే జరిగింది.

శ్రీ:- లక్ష్మయ్యగారూ, మీకు వోటియ్యమని కచ్చితంగా చెపితే మీకు బాధఅవునా? అదీకాక యీ రోజులలో యెక్కడ చూచినా,

సీ. రాజకీయజ్ఞాన రాజితులగువారి
పక్షభావము లేక బరగువారి,
దేశోద్ధరణదీక్షఁ దేజరిల్లెడివారి
ధర్మవాదంబున దనరువారి,
ప్రజల శ్రేయముగోరి పాటుపడెడివారి
నర్థాభిలాష లేనట్టివారి,
స్వప్రయోజనపరత్వము త్యజించినవారి
త్యాగస్వభావులై యలరువారి,

గీ. ప్రజల బిడ్డలవోలె గాపాడువారి,
సభ్యులుగ నెన్నుకొని మీరు శక్తికొలది,
దేశమాతకు చింతలు దీర్పరయ్య,
ధీరవరులార! ఓ భారతీయులార! 1

అని ప్రబోధము జరుగుచూండగా మనము వోటివ్వ కని యేమిలాభం?

ల:- అయ్యా! అటువంటివాళ్ళను యెన్నుకోమని ప్రచారం చేయడం సులభమేగాని, ఆ లక్షణాలన్నీ ఉన్నవాళ్ళు దొరకాలిగదండీ!

శ్రీ:- ఏం, ప్రజానాయకులలో అటువంటివారు లేరనా మీ అభిప్రాయం?

ల:- లేకేం? యెన్న మామిడిపళ్ళుగా చెప్పినట్లు,

సీ. పూని వేదిక నెక్కి బోధ సేయుట కాదు
చెలగి ముమ్ముందు తా జేయవలయు,
అనుపమ మేధావినై వెలుంగుట కాదు
త్యాగస్వభావుడై దనరవలయు,
ప్రజలకై నిరతంబు బాధలొందుట కాదు
వారి విశ్వాసంబు బడయవలయు,
నిర్మాణ కార్యముల్ నిర్వహించుట కాదు
దురభిమానంబులు దుంపవలయు,

గీ. సంఘమందలి కష్టనష్టంబు లెంచి
ప్రజలె తానుగ నాతడే ప్రజలుగాగ,
నలరు నాతడే నాయకుం డవని నన్య
లరయ నాయక వర్యులై వరలగలరె? ౨

శ్రీ:- సజ్జనులు దుర్జనులు ప్రతి సంఘంలోను ఉంటారు.
ల:- అన్నట్టు అడగడం మరచాను మీరెందాకా వెళుతున్నారు?
శ్రీ:- విశాఖపట్టణందాక.
ల:- నూజవీడు. ఇదేమి పత్రికండీ?
శ్రీ:- శంఖారావం.
ల:- ఓహో! మన కూచిభొట్లవారిదేనా?
శ్రీ:- ఊఁ.
ల:- బాగా వ్రాస్తారండి.
శ్రీ:- అవును, వ్యాసాలు చాలా ఘాటుగా ఉంటున్నాయి.
ల:- (పత్రిక వంక తేరి పారచూచి) ఏమిటండీ? పద్యాలు కూడా వేస్తున్నాడా యేమిటి?
శ్రీ:- అవును.

ల:- అయితే బిగ్గరగా చదవండి పంతులుగారు నేను కూడా వింటాను.

సీ. స్వాతంత్ర్యయుగమిది సర్వసంఘములకు
 పలుదాస్యబంధముల్ బాపవలదె?
సంస్కారశకమిది సర్వపూర్వాగ దురా
 చారముల్ బాపంగ గోరవలదె?
సామ్యభావోదయ సమయ మియ్యది వేగ
 భేదభావంబుల వీడవలదె?
శాంతికాలంబిది సకల రాష్ట్రస్వరా
 గ్గములను వేగ సాగనీయవలదె?
గీ. విశ్వకల్యాణకరమగు వెలయునట్టి
 సౌహృద్యమంబులో సర్వమహోన్నతముగ,
ధరణి సార్థక మానవత్వంబు గనుడి
 శిష్టగుణులార! సోదరస్త్రీజనులార! 4

ల:- చాలా ఉత్కృష్టమైన ఉపదేశం.

శ్రీ:-

సీ. ఏనాడు దేశీయవృత్తులెల్లను వీడి
 ఘన దాస్యవృత్తికై మరలినాము,
ఏవేళ మనచేతి పారిశ్రామ్యము నణంచి
 పరదేశ వస్తుప్రీతి వలచినాము,
ఏక్షణం బైక్యభావేచ్ఛల విడనాడి
 పక్షాంతరంబుల నమరినాము,
ఏదినంబున పారిశ్రామ్యవృద్ధి నెరుగక
 పాశ్చాత్యరీతుల బరగినాము,

గీ. అప్పుడేయంతరించెనాహా! సమస్త
భాగ్యముల్, పూర్వవృత్తులు, పౌరుషములు,
ఘనపరిజ్ఞానసంపదల్, గౌరవములు,
కలదెయికదీనికంటెదుఃఖంబుమనకు! 6

ఇట్లు వీరుభయులు ముచ్చటించుకొనుచుండ నందలి ముఖ్యాంశములనెల్ల నామనఃఫలకమున లిఖించుకొంటిని. ఇంతలో నెప్పుడు వచ్చినదో నూజవీడు స్టేషను! బండియాగినది. అంతట శాస్త్రిగారు రావుగారినుండి సెలవుగైకొని వెడలిరి.

# దీ న జ నో ద్ధ ర ణ

ఱాల నొరయికవలననే యనల ముదయించును. నీటియం దుబుకుడుశక్తికలుగుట యొత్తిడివలననే. వేగ మతిశయిల్లినపుడే వాయువునందలి గంభీరనాదము ప్రత్యక్షరూపము దాల్చును. అటులనే మహాశయుల మహౌదార్యాదిగుణంబులు తేజరిల్ల వారి కొదవెడు క్లిష్ట పరిస్థితులే మూలమగును. ఈ వర్గమునకు చెందినవాడు శ్రీధరరావు. ధర్మరక్షణార్థము, ప్రజాహితముకొరకు, నిష్కామ కర్మాచరణ నిరతుడై తనయందు భారతీయ రుధిర ధార పాఱుదనుక తన సర్వస్వమును, తుదకు అసువుల నర్పించుటకేని కంకణము ధరించి, దుర్భరానంత విపదాళి దూగుచున్నవాడాతడు. ఏయనాథజనులదాస్య శృంఖలములనుండి విముక్తులజేసి భారత సంఘోద్ధరణ గావింప నాతడు చిన్ననాటనుగోలె పాటుపడుచుండెనో, వారిపక్షము వహించి ఆనా డతడు విజృంభింపవలసివచ్చెను. నిక్కముగ ప్రపంచములో నందం దిట్టి మహనీయులుండుటం జేసియే

లోకబాంధవులై బరగు ఆసూర్యచంద్రాములు సకాలమున సకలప్రాణిహితార్థమై వెలయుచున్నారు. లేకున్న నెప్పుడో యంతరించి పోయెడివారేమో.

నూజివీడు స్టేషనులో బండియాగినవెంటనే హరిజను లిరువురు మాపెట్టెనెక్కిరి. హరిజనశబ్దముదివ్యమై మార్గదర్శక మైయున్నను తన్నామమును ధరించిన వీరలు వేషభాషలం బట్టి సార్థకనామధేయులు గాకుండిరి. మలినదేవత వారినావే శించియుండుటచే వారు తమయందలి అంటరానితనమును పోగొట్టుకొనలేకుండిరి. ఇందులకు వారివృత్తియే కారణభూత మనవచ్చును. కాని స్వీయవృత్తి ననుసరించుచు ధర్మపథ మందు మెలగుజీవి యేవర్ణమునందు జనించినను లోకమున పూజనీయుడు కాకపోడు. ఇందులకు ధర్మవ్యాధుడే ప్రబల నిదర్శనము. ఈ హరిజనులు మాపెట్టె నెక్కుచుండగనే పె క్కండ్రు వారి నేవగించిరి. మలినసంకలితములైయున్న వారి దుస్తులు, స్వేదబిందువులచే తడసియున్న వారిదేహములు, పొగలుగ్రక్కుచు వారినోటిలో కాలుచున్న చుట్టలు జూచి కొందరు వారి 'నిచ్చట నెక్కవల'దనిరి. కొందరు మోములు చిట్లించుకొనిరి. కొందరాత్మగతమున నేమేమో గొణుగు కొనుచుండిరి. మరికొందరు ముసిముసినవ్వులు నవ్వుకొనుచు గూర్చుండిరి. ఆస్థితిని తత్త్వమెరిగిన జీవిగాంచినచో కృతయుగ మును స్మృష్టించియుండకపోడు. ఆహరిజను లివియన్నియుసరకు చేయక మాపెట్టెయందేయెక్కి భయాక్రాంత చిత్తములతో మావైపు మెల్లగవచ్చుచుండిరి. అంతనాప్రక్కన కూర్చున్న వృద్ధుడొకడు కోపాటోపదీపితుడై 'ఇల్లాయెక్కడి కొస్తార్రా

మీరు! అల్లా ఆవైపుపొండి' అని గంభీరగర్జనము చేసెను.
'క్షమించండి బాబో, చూడలేదు మిమ్మల్ని' అనుచు వారు
వినమిత వదనులై వేరొకవైపు తిరిగి రెండడుగులు వేసిరి. వెం
టనే శ్రీధరుని సాదరదృక్కులు వారిపై బడెను. ఆహరిజనుల
ప్పుడు నిక్కముగ హరిజనులైరి. ఇదంతయు గాంచుచున్న
యొకవ్యక్తి 'సంఘసంస్కర్తలు కాబోలువీరు! సంఘాన్నివుద్ధ
రించటానికి పుట్టారు,' అనియెత్తిపొడిచెను. అత్యంత శాంత
స్వాంతమున శ్రీధరరావు తనమృదుమధురభాషణము లుపక్ర
మించెను. ' అయ్యా! మీరు నన్ను సంఘసంస్కర్తలనిపరిహా
సించినంతమాత్రమున నాకు బాధలేదు. ఇప్పుడు నేను వీరిని
దగ్గరకు తీసుకొంటేననికదా మీకు కోపమువచ్చుట? అట్లు
చేయుటలో దోషమేమియో నాకుబోధపడలేదు. వారిదగ్గర
యేవో లోటుపాటులుండుటచేత వారిని దూరముగ నుంచెద
మందుము. వారిని మనము దగ్గరకు తీసుకొని బాగుచేయుటకు
బదులుగ దూరముగ తరిమినచో వారింకను అధోగతిపాలు
కారా! నిజముగ భ్రాతృసమానులగు ఈయేడుకోట్ల హరిజనుల
నుద్ధరించిననాడు మనముమనదేశమునే ఉద్ధరించిన వారమగు
దుము. లోకమునకు మంచిగుణపాఠము నేర్పినవారమగుదుము.
మనదైవభక్తిని ధనధాన్యసంపదను, జ్ఞానసంపదను, సదుప
యోగము చేసినవారమగుదుము.'

ఇట్లు శ్రీధరరావు వాగ్ఝరి ప్రవహింప నందలి వారెల్ల
నిశ్శబ్దముగ నాలకించిరి. అందొక్కరేనియు నాతనితో వాగ్వి
వాదమునకు గడంగ సాహసింపలేదు. తదనంతర మాతడు ఆ
హరిజనులతో ముచ్చటింపదొడగెను.

శ్రీ:—అరేయ్, మీదగ్గర వాసనకొడుతోందేమిటి?
ఎం:—లేదు దొరగారూ!
శ్రీ:—ఉఁహుఁ, అబద్ధమాడితే, నేనుకనుక్కో లేననుకున్నారా?

సీ॥ మద్యపానాభ్యాస మాయలోజిక్కిన
పాపుడారోగ్యంబు బాయుగాదె
ఉన్మాదమునసెంత యూహావంతుండైన
వెఱ్ఱి చేష్టలనుగావించుగాదె
ధనమెల్లబాసి యెంతటిభోగియేనియు
నఖిల దుర్దశలపాలగునుగాదె
ఎంతనిష్కల్మష స్వాంతుడైననుగాని
మూర్ఖుడై దుష్కీర్తి బొందుఁగాదె!
గీ॥ ఇల్లు నొడలును సీరితిగుల్లచేసి
భార్యయుం బిడ్డలాకలిబాధచేత
మొఱలిడగజేయు మధుపానమును త్యజింప
మీరు వేగిరపడరాదె మేలుకాదె!

సు:— అవును, బాబయ్యగారు! మీబోటిదొరలదగ్గరకూకుంటే వాసనొత్తుందనే సుట్టతీత్తుండా బాబు, మల్లామీరేమనుకుంటారోఅని... ...
శ్రీ:— ఓరి వెఱ్ఱివాడ! ఒకతప్పుచేసి దానిని కప్పిపుచ్చడానికి వేరొక తప్పు చేస్తావా?
సు:— అయితే మాచినోడి దొరగారుండారు. ఆయనయితే, ఒకసుట్టేంటి బిరాండేంటి, అప్పుడప్పుడు గంజాయి దమ్మెత్తాడుకూడాను. ఒక్కొక్క సారైతే బాగానల్లమందుమింగి మత్తుగా పడివుంటాడు. మరే, ఆళ్ళంతా

సేత్తారుగందా, యియ్యన్నీతప్పులెట్టా అవుతాయిబాబూ తెలియ కడుగుతుండాగాని?

శ్రీ:- వాళ్లెవరో చేసినంతమాత్రాన దురభ్యాసాలు సదభ్యాసాలవుతాయిటా! నీవుయిప్పుడు చెప్పినవన్నీ దురభ్యాసాలేకాని మంచివికావు. వాటివలన లాభాలకన్నా నష్టాలేయెక్కువ.

సీ॥ ధననాశనమొనర్చి తన భృత్యునిగ జేయు
భంగు సాంగత్యంబు భంగకరము,
రక్తమాంసములూడ్చి రాజు రౌతుగ జేయు,
నభినీతో స్నేహంబు విభవహాని,
వేళకులేకున్న విలవిలలాడించు
పానీయములమైత్రి బాధనొసగు.
ఎచ్చోటనైననుగుచ్చెత్తి పీడించు
నవని నస్యపుచెల్మి హాస్యకరము,
గీ॥ భాగ్యభోగ కాలాదుల వ్యర్థపరచు
తొడరి పేకాట బహువిధదోషకారి,
మనుజులకు వైరులివి, వీనిమైత్రిభువిని
నలదువలదెన్నటికి పగవారికైన॥

ఇంతేకాదు,

సీ॥ జూదమాడుట మహాఖేదభాజనమౌను
ధనమునశించు పేదరికమబ్బు,
పొగత్రాగుటను శ్వాసపుష్టియు క్షీణించు
పలుబాధలబ్బు తాపములు హెచ్చు
వెలయాండ్రపొందుచేగల గౌరవముపోవు
నిల్లు నొడలునుగూడ గుల్లయగును

దుర్జనసాంగత్యదోషంబునను హీన
దశయు గల్గును పేదతనము పెరుగు
గీ॥ ఇట్లు హానికరంబులౌ నెల్ల వ్యసన
ముల విసర్జించి నిగ్రహస్ఫూర్తితోడ,
నాత్మగౌరవ మొప్ప వంశాభివృద్ధి
బడసి సజ్జీవనంబును గడుపవలయు॥

నేను చెప్తున్నాను వినండి, మీదగ్గర వీటిలో కొన్ని చెడ్డఅలవాటులున్నాయి కాబట్టే మీకు కొన్ని బాధలు కలుగుతున్నాయి. మీరు కూలిచేసేవాళ్లయినప్పటికీ శుభ్రంగా ఉండటానికి ప్రయత్నం చేయాలి.

సీ॥ ఆరోగ్యవిధులెల్ల ననుసరించుచు
సబాహ్యాభ్యంతరశ్శుచి నందవలయు,
గృహములయందును గృహ సమీపములందు
మాలిన్యమును రూపుమాపవలయు,
మద్యపానాది యున్మాదకరంబులౌ
దుష్కర్మలెల్ల పోద్రోలవలయు,
పాంఘికమతదురాచారముల్ త్యజియించి
సత్కార్యములె మీరు సలుపవలయు,
గీ॥ అన్యసోదరులట్లు మీరనుదినంబు
చిత్తవాక్కర్మలందు విశేషశుచిని
బడసి దోషంబులెల్లను బాయవలయు
భరతసుతులార! హరిజనపౌరులార!

ఇట్లు శ్రీధరరావు వారికుపదేశించుచుండ దూరమున నొకజంతుహింసాకార్యము నాకంటబడెను. పాపము నోరులేని

జంతుకోటి, అందును ముఖ్యముగ సాధుజంతువులు మనవలన ననుభవించు ఘోరములు తలంచినపుడెల్ల నాహృదయమల్లే దహించుకొని పోవుచుండును. కావుననేనాతనితో భాషింప గడంగితిని. అయ్యా ఈనోరులేని జంతువులకెన్నడుముక్తి కల్గుతుందోగాని, హరహరా! వీటికిమనవలనకలిగేబాధలు యిన్నీ అన్నీ కాదండి!

సీ॥ వేటకేగుట చాల వేడ్కగొల్పునటంచు
సాధుజీవులబట్టి చంపువారు,
పసులపందెములన్న ప్రమదకారకములం
చెంచుచు వాని హింసించువారు.
భరియింపగారాని పసులిచ్చి యూరక
గొట్టుచుఁగడుకష్ట పెట్టువారు,
వానివలన పూర్ణఫలమొంది వానికి
తిన యూరె మిడక వేధించువారు,
గీ॥ మొఱలిడగలేక కన్నీరు వరదగాగ
తల్లడిల్లు జీవులజూడ దయగలుగదె?
ఈశ్వరుండుసహించునే యిట్టిపనులు
మానవులు భూతదయ సుంతపూనరాదె

నేనీరీతి వచించుతరి వేరొకవ్యక్తి శ్రీధరరావుతోడ 'అయ్యా యజ్ఞములలోను జాతరలలోను పశుబలివలన భగవత్ప్రీతి కలదని పెద్దలనుచుందురే! మీరెందుకు వీని నింతగా ద్వేషించుచున్నారు?' అని ప్రశ్నించెను. అంత శ్రీధరుడిట్లనెను.

శ్రీ:— సీ॥ సకలప్రపంచంబు సర్వభూతంబులు
పరమేశ్వరస్వరూపంబుగాగ

శిష్టరక్షణమును దుష్టశిక్షణమును
మానితంబగు దివ్యమతముగాఁగ
పరులశ్రేయముగూర్చు వరధర్మకార్యముల్
ఘనతరమోక్షమార్గములుగాఁగ
సాధుజీవులుపొందు సంతాపముల్
తనపైఁజెలంగిన యమబాధగాఁగ

గీ॥ నాత్మవత్సర్వభూతాని యనెడునీతి
చిత్తవాక్కర్మలం దభ్యసింపజూచి
పుడమి జన్మించినందుకు భువనసేవ
సల్పి, తరియింప జూచును సజ్జనుండు.

---

# ఆధ్యాత్మిక విచారము



ఏపుట్టయందేపాముకలదో యెవరికెఱుక. కావున నెవ రేని పురుషుని సదసత్తుల నెఱుంగ నెంచిన నాతని బాహ్య స్వరూప పరిశీలనముతోడనే తృప్తినొందక, యాంతరంగిక భావములగూడ పరీక్షింపవలయు. అత్యంతంబగు వికృతాకార మును గలిగి చూపరుల కెంతయు నసహ్యముగ గానుపించు సముద్రపు చిప్పలు తమగర్భగోళమున ననుపమతేజోవిలాస భాసురంబు లగు మౌక్తికంబుల నిక్షేపించుకొనుటలేదా! అను క్షణమును సౌందర్య వృష్టిని గురిపించుచు తమ విశేషమా ధురీ సౌరభ్య మహిమాతిశయముచే జనుల నమందానంద వీచికల నోలలాడించు కేతకీసుమంబు లత్యంత ప్రాణాపాయ

కరంబులగు మిన్నాగుల తమకుక్షీనుంచుకొనుటలేదా! తలచి ననేగాని దధినుండి నవనీతము గోచరింపని భంగి పరిశీలించి ననేగాని పరుల మంచిచెడుగులు వ్యక్తములుగావు. ధాత్రి యందు గులకరాలనుగాంచి వజ్రములని భ్రమపడువారు లేక పోలేదు. వజ్రమునుచూచి ఱాయికదా యని త్రోసివేయు వారును గలరు. కాని యందఱి గుణాగుణములు వివిధోపా యముల గన నెంచిన యనుభవజ్ఞునికే తెలియుగాక.

వట్లూరికడ హరిజనుల గమనానంతరము కొండొక వ్యక్తి మా పెట్టెయందు ప్రవేశించెను. మోకాళ్ళవరకు జీరాడు కాషాయాంబరములును, ఒక కేల కమండలమును, మఱొక కేల నిడుపాటి సంచియు, కక్షయందొక కకపాలయును, మూపున కృష్ణాజినమును, పాదముల పాదుకలను, చూడ నతడు సాధువని స్పష్టమగును. ఆతని విగ్రహసౌష్ఠవము పరి కింప నొక యపూర్వ వ్యక్తిత్వము తోచుచుండెను. వెనువెం టనే మరియొకపురుషుడు త్వరితగతినివచ్చి సమీపముననున్న మా పెట్టెనెక్కెను. దీర్ఘమై నరసిన గడ్డమును గలిగి, తెల్లని తలపాగను ధరించి, పరాయియు జుబ్బాయుదాల్చిన ఆ వ్యక్తి మహమ్మదీయుడని వేరుగ చెప్పనక్కఱలేదు. నేను వీరిని తిల కించుచుండగనే బండి బయలుదేరి కొన్నిగజముల దూరము సాగిపోయెను. కాని అది మరల అంతలోనే తటాలున ఆగెను. 'ఏమిది' అని మేము కిటికీల నుండి చూపుక్కల నిగిడ్చితిమి. మార్గమున కొన్ని జంతువులు నిలచియుండెను. శ్రీధరరావు గారు ధూమశకటసారథిని ప్రశంసించిరి. ఔరా! భూతదయ తనంతతానే వచ్చునా. "దయ యనునది మానవులందు

మాత్రసే చూపవలసినది కాదుకదా! నిక్కముగ సర్వభూత దయాపరత్వము యిట్టియెడలనే యన్వర్థము గాంచును. శ్రీధర రావుగారు వెలికి పరికించుచుండ వేరొకపెట్టెయందున్న యొక వ్యక్తి - అతని పరిచయుడే కాబోలు నాతని రమ్మనిపిలచెను. అంతట నతడు వేగముగ నటకు జనియెను. బండి మరల కదలెను. ఇంతలో నొక వేదాధ్యయన పరుడు, 'నమోనమః, స్వాములవారు! దయచేయండి యిక్లా' అని ఆనూతనవ్యక్తి నాహ్వానించెను. 'ఓహో సుబ్బావధానులుగారా! ఎక్కడ నుంచి వస్తున్నారు? ఎందాకా వెడుతున్నారు?' అనుచు నాతని సమీపించి కూర్చుండెను.

సు :- నేను బెజవాడనుండీ వస్తున్నాను. ఏలూరు వెడుతున్నాను. మీరెందాకా వేంచేస్తున్నారు?

స్వా :- విశాఖపట్టణం వరకు.

నేనంతకు పూర్వము రెండుమూడు పర్యాయము లా స్వాములవారిని చూచియుంటిని గాని, వారి శక్తిసామర్థ్యముల గ్రహింప లేనైతిని. ఆనాడు మాత్రము వారి పారమార్థిక సమస్యా విచారణ శ్రవణచేయముగ నవలోకించి ధన్యత నొందితిని.

సు:- మీ దర్శనభాగ్యము మళ్ళా చాలానాళ్ళకైంది నాకు.

స్వా:- దానికేమిలెండి. మీ గృహస్థాశ్రమ ధర్మాలన్నీ చక్కగా నెరవేరుతున్నాయా?

సు:- మీ అనుగ్రహంవల్ల యింతవరకు బాగానే జరిగాయి. ఇకముందేమో?

స్వా:- ఎందుకా సందేహం?

సు:- స్వామీ, యేమీలేదు. గృహస్థాశ్రమ ధర్మాలు నెర వేర్చడం సామాన్యపుపనికాదని అనుభవశాలురగు మీకు నేను చెప్పవలెనా? తమరే మాఊరిలో ఒక పర్యాయము,

సీ॥ క్రమముగ ధర్మార్థ కామమోక్షాదుల
 సాధింప తగు కృషిసల్పువాడు,
వ్యసనసంతతికి లోబడక నిష్కల్మష
 జీవయాత్రను నభ్యసించువాడు,
అతిథియభ్యాగతు లరుదేర నర్ఘ్యపా
 ద్యాదు లొసంగుచు నలరువాడు,
విధ్యుక్తముల నెరవేర్చుచు నెల్లప్పు
 డాధ్యాత్మిక పథంబు నరయువాడు,

గీ॥ బ్రహ్మచర్యాశ్రమంబున భక్తిమీర
నేర్చినట్టి సద్బోధనల్ నేర్పుతోడ
నాచరింపంగ యత్నించు నట్టివాఁడు
వరగృహస్థాగ్రగణ్యుడై బరగుభువిని.

అని సెలవిచ్చినారుకదా!

స్వా:- అవునవును. అందువల్లనే గృహస్థాశ్రమం అన్ని ఆశ్ర మాలలోను ముఖ్యమైనదన్నారు. అడగడం మరచాను. మీ గ్రామంలో ఉన్న వరదరాజులుగారు క్షేమముగా ఉన్నారా? పూజలు భజనలు ఆయన యథాప్రకార ముగా చేస్తున్నాడా?

సు:- ఆ, కులాసాగానే యున్నారు. పాపం ఆయన చాలా మంచివాడే, కాని కర్మ దొర్లుకొచ్చినప్పుడు యెవరేమి చేయగలరు లెండి.

స్వా:- ఏమి, అట్లాఅంటున్నారు ?
సు:- ఏమీ లేదు లెండి; చంద్రునికి కూడా కళంకమున్నది కాదూ ?
స్వా:- మీ మాటలలో అంతరార్థం నాకు బోధపడలేదు.
సు:- ఎందుకులేండి, మీమనసుకు కష్టమేస్తుంది అనవసరంగా
స్వా:- ఏమిటి అంత కష్టమువేసే విషయం? చెప్పండి భయము లేదు.
సు:- అయ్యా క్షమించండి. 'చేసేవి శివపూజలు, దూరేవి దొమ్మరిగుడిసెలు' అన్నట్టుగా ఉంటే యెట్లాగండీ? పాపం ఈమధ్య ఆయన కొంచెం మారిపోయినాడు లేండి.
స్వా:- ఏవిధంగా ?
సు:- అదేమి కర్మమోగాని యీ మధ్య ఒక వేశ్యా సాంగత్యంవల్ల కోర్టుకు కూడ యెక్కాడు. అందులో ఉన్నవి లేనివి నోటికొచ్చినట్లు అవసరమైనన్ని అసత్యకల్పనలు మాట్లాడు తున్నాడు.
స్వా:- హరి హరి. హుఁ, అంతేలెండి, యెవరి కర్మం యెట్లా ఉందో యెవరికి తెలుస్తుంది. పాపం భక్త శేఖరుడని బిరుదేమి ! యీ పనులేమి ! కర్మకాకపోతే!

సీ॥ వేద వేదాంగాది వివిధ సద్గ్రంథముల్
పఠనచేసిన చేయవచ్చుగాక,
పుణ్యభూములను సంపూర్ణాను రక్తి ద
ర్శింపంగ యాత్రలుచేయుగాక,
అశ్రాంతమును విగ్రహారాధనలయందు
నిష్ఠాగరిష్ఠుడై నెగడుగాక,

సర్వకాలములందు జగదీశునామంబు
స్మరణసల్పుటయందె బరగుగాక.

గీ॥ చిత్తవాక్కర్మలందు విశేషనిష్ఠ
లేనిచో వీని ఫలమెల్ల హీనమగును,
గాన త్రికరణశుద్ధిగమానధనులు
జీవనముసల్ప యత్నంబుచేయవలయు

ఇట్లు, వారిరువురు నిష్టాగోష్ఠి నిమగ్నులై యుండ, గవాక్షమునుండి నీటితుంపురులు తనపై బడుటచే నొక మహమ్మదీయ బాలుడు సుబ్బావధానులుగారి మోల గూర్చుండెను. వీని స్పర్శ వారి సంభాషణకు శాంతిజేసెను. లేకున్న వారింకేయే విషయములగూర్చి ముచ్చటించెడివారో! అవధానులుగారంతట నాబాలకునితో, 'అబ్బాయి, ఆబల్లమీద కూర్చో కొంచెం. దగ్గర దేవతార్చన ఉంది' అనెను. ఆతడు సవినయముగ వేరొండు బల్లపై కూర్చుండెను. ఇయ్యది సర్వము దాపుననే కూర్చుండి వీక్షించుచున్న సాహెబుగారు, 'దేవతార్చన్ యేమిటండీ శాస్త్రుల్‌గారూ!' అని పృచ్ఛచేసెను. 'అంటే మా దేవుళ్ళుండే పెట్టె' అని అవధానులుగారు ప్రత్యుత్తరమొసగిరి.

సా:- ఓహో, మీకీదగ్రి దేముడ్కి యిగ్రిహాల్ ఉంటాయి కాదూ. అయితే మీరు యిగ్రిహాల్‌కి దిన్మూ దిన్మూ పూజా సేస్తారా శాస్త్రుల్‌గారూ ?

సు:- ఆ, చేస్తాము.

సా:- ఐతే, మీరు యిగ్రిహాల్ పెట్టి ఫూల్ పెట్టి పూజాసేస్తే, మన్మూ యిగ్రిహాల్ గిగ్రిహాల్ లేకుండానే దేవుస్కి

నమాజ్ చెప్తాం. మీరు యిగ్రహంమీద మన్సుపెట్టార్, మాకీ యేక్దం దేవుస్మీద మన్సూపెట్తాం. అది మాకీ మీకీ హుండే యత్యాషం.........

స్వా:- సాహెబ్‌గారూ, భగవంతుని ప్రార్థించే మార్గములు చాలా ఉన్నాయి. వానిలో ఒక్కొక్క మతంవారు ఒక్కొక్క పద్ధతిని అవలంబిస్తున్నారు.

సీ॥ భక్తికాధారంబు ప్రతిమగావున విగ్ర
హారాధనము యుక్తమనెడువారు
లోకైకవిభు విగ్రహాకారమున గొల్చు
టనుచితమంచు వాకొనెడువారు,
ఇవ్వినవ్వియునేల యీశుఁడే లేడంచు
తీవ్రమార్గమున వాదించువారు,
ఈశుడుండెడుగాక యేలయాతనిగొల్వ
వలెనంచు ధృతిమీఱంబల్కువారు,
గీ॥ ఇట్లు పెక్కువిధంబుల నీశుగూర్చి
శుష్కవైషమ్యముల బెంచుచుండుటెల్ల
మాని, భువిదైవభక్తి, పుణ్యానురక్తి
పాపభీతియుగల్గి యొప్పారవలయు॥

సా:- అయితే సాములాళ్లుగారూ! మీకీ మన్సుమ నిజం చెప్తున్నామనిఖోపం పడేదివద్దు. మీరు యిప్పుడు సెప్పిన భేదాల్ గీదాల్ అన్నీ మీకీ మతంలోనే హున్నాయ్.

స్వా:- పూర్వమీ వర్ణములు మతములు జాతులు దేశకాల పరిస్థితులను బట్టియు, సత్వరజస్తమో గుణముల భేదముల బట్టియు, వారివారి కర్మల భేదముల బట్టియు ప్రజల ఉప

యోగముకొరకే చేయబడినవి. కాని కాలక్రమమున వీటి ముఖ్యోద్దేశములను పూర్తిగ మరచిపోయి మనలో చాలా మంది జాతి మత వర్ణ ద్వేషములను పెంచుకొని ఐకమత్య మునువదలి కష్టాలపాలగుచున్నారు. మొన్న బెజవాడలో ఒక మహాత్ముడు చెప్పిన మాటలు నాకు బాగా నచ్చి నవి. ఆయన ఒక బహిరంగసభలో ఉపన్యసిస్తూ,

సీ॥ నామభేదమెగాని యీ మతంబుల కెల్ల
దేవుడొక్కడెయంచు తెలియరయ్య,
వర్ణ విభజనెగాని భావింప నెల్లరు
సరిసమానులటంచు నెఱుగరయ్య,
జాతిభిన్నమెగాని సకలదేశస్థులు
నొక కుటుంబమురీతి నుండరయ్య,
అంగభేదంబులే యగుగాని స్త్రీ పురు
షులు సామ్యులేయంచు దెలియరయ్య,

గీ॥ కాన మత జాతివర్ణలింగముల భేద
భావముల వీడి సామ్యభావమును బూని
కష్టసుఖముల సమముగ గాంచరయ్య
ధీరమతులార! సార విచారులార!

అని ప్రజలకు తీవ్రప్రబోధము గాంచినాడు.

సు:-సీ॥ తఱచుగా మన తల్లిదండ్రులు బోధించు
నీతివాక్యములెల్ల నీట గలిపి,
గురుసన్నిధిని నేర్చుకొనినట్టి ధర్మముల్
క్షణకాలమైనను స్మరణ లేక,

మతగ్రంథములు దెల్పు నతులిత నీతుల
నసుసరింపగ నిరసనముప్రాని,
అవతారపురుషుల యాజ్ఞల నెల్లను
సిరసావహించెదు చింత వీడి,

గీ॥ జీవముల నెల్ల నుత్తమ జీవులయ్యు
మెలగుచున్నాము దురిత ప్రమేయులమయి,
కటకటా! జ్ఞానమును వీడి ఘనత వీడి
జనులు పాపాత్ములగుట విచారకరము!

స్వా:- అవును, అవి తగవు. ఎందుకంటే,

గీ॥ స్వమత ధర్మావలంబనా సక్తుడయ్యు,
నరుడు పరమత విమతిరై బరగెనేని,
పొరుగువారింటినగ్ని పాల్పరచి సంత
సించు మూర్ఖునివోలె నశించుగాదె!

క॥ ధరను గల సర్వమతములు
పరమపద ప్రాప్తికొరకె భావింపబడెన్,
అరయగ పరమత కలహము
పరమేశ్వరు మనముఁ గలతపరచుట కాదే!

అని చెప్పబడి యున్నది.

కావలెనంటే ఒకరివిషయములు ఒకరు ప్రేమపూర్వకముగ సద్విమర్శనముచేసుకోవచ్చును. దానివలననష్టములేదు. సద్భావముతోకూడిన అన్యోన్యవిమర్శన వలన అభివృద్ధి సర్వవిషయములలోను, కలుగగలదు. అంతేకాని కలహస్వభావముతో మనమొకరినొకరు విమర్శించుకోరాదు. అట్లు సోదర భావములో మనముజ్ఞానదాయకములగువిమర్శనలచేయక దూ

షణ విమర్శనలచేస్తూ ఒకరినొకరు చంపుకుంటూఉంటే, మనము అన్నిజీవులకంటె ఉత్కృష్టజీవులమని యెట్లుచెప్పుకో గలము? ఇక మనకీ యితరజీవరాసులకీ భేదమేముంటుంది? భగవంతుడు మనకు ప్రత్యేకభావనాశక్తి, తెలివితేటలు యిచ్చి నందువలన ఫలితమేమి? కాబట్టి మనము శాంతమార్గముల చేత ప్రజలలో జాతిమతవర్ణ దురభిమానముల పారద్రోల యత్నింప వలయును. నిజముగ మనుష్యుల క్షేమము కొరకు స్థాపింపబడిన ఈ వివిధసంస్థలు నేటినాగరిక ప్రపంచములో మానవులచే దుర్వినియోగముచేయబడి, మానవజాతికి హానికరముగ పరిణమించుట యెంతయుశోచనీయము, అరిష్టదాయకము, హాస్యాస్పదము.

సా:- (నాతోడ) పంతులుగారూ! ఐతే మన్సుమాత్రిం మీాకీ యెంద్కూ హూర్కే దూష్ణాచేస్తాం? ఏం మాకీ మాత్రం తెలివిలేదా?

స్వా:- అవును లేండి. మనలో ఆ సహానభావము యేర్పడాలి.

సా:- అవునూలేండి. సాములాళ్లు, భో తచ్చాగా చెప్పార్. నిజం అంతేగాని దాన్కి సందేహం లేద్. ఇంక మాకీ యెళ్ళి వస్తాం. మనదీ ఊరు వచ్చేసింది. సలాం తీస్తాండి.

స్వా:- మంచిది.

ఇంతలో బండి యేలూరు స్టేషనుకు వచ్చి చేరెను. సాహెబుగారును సుబ్బావధానులు గారును దిగిపోయిరి. స్వాములవారంతట మఱుగుపెట్టెలోని కరిగిరి. తదుపరి బండిలో నేమి జరిగెనో?

---

# శ్రీ ధ ర వి జ య ము

ఈ భువన నాటకమున నేవేళ నెవడెట్టి పాత్రనుబూనునో వచింపనేరితరము? నేటి సార్వభౌముడు రేపట నెట్లుండునో! నిన్నటి జోగి నేడు భోగి యగుటలేదా? నిక్కముగ ప్రకృతి యందలి ద్వంద్వములు క్షణభంగురములు. ఇదియే కదా సృష్టివైచిత్ర్యము. ఈ విషయము మన కథాసరణియందేలనందురా? కారణము లేకయే కార్యము లేదుకదా.

ఏలూరులో బండిఆగినవెంటనే వర్షాగమనపూర్వమంబుదము లాకసమున గ్రమ్ముకొను భంగి యిరువది యోధులు మా పెట్టెలోనికి జొచ్చిరి. మాగుండియ లవిసెను. ఆ వికారములకు తగిన శ్వేతవర్ణము, యీ రెంటిని జతకూర్చు ఆ కాకీ యుడుపులతాల్పు, యీ మూటిని మొటిగించు ఆ నల్లనిబూడ్సుల పటపటలు, వీని సాయముగొని గుండె లదరజేయు ఆ తుపాకుల సారింపులు, యిట్టి మెఱుపులతో వారి వాగ్గర్జనలు, అబ్బా! మేమే తబ్బిబ్బైనప్పుడు యిక పసికందుల సంగతి చెప్పనేల? 1 **'Get that side, you people'** అను వారి మేఘనాదము చెవులకు సోటాసంగ నందున్నవారు మా వైపునకే పారివచ్చిరి. శిశువు లొకరి మీద నొకరు పడిరి. కొందరు యువకులు తావులేక నిలువవలసివచ్చెను. కొందరు వేరుపెట్టెలకుబోవ ప్రయత్నించిరి. కాని అందు యీవిధి కలుగకున్నను అవి జనసమ్మర్దములై యుండెను. మాపాటు యెట్లున్నను యోధులు మాత్రము సుఖాసీనులైరి. ఇదేమి జులుము అని

---

1. మీరంతా త్వరగా అవైపు పోండయ్యా

అడుగమూకేనో రాజదయ్యో! ఎంతసాహసము! ఎంతసాహసము! రువదియవ శతాబ్దమా! ఇట్టివి జరుగుటయా! ఇది నా దైవవిధి. ఆసమయమున శ్రీధరుడేయున్న యీచీకాకు కలిగియుండదుకదా! ఈవిపదంధకారము లా రవిప్రభల ముంగిట విజృంభించునా?

నిక్కము కష్టకాలమున మదీయనామ ముచ్చరించినంతనే వచ్చెదనను గీతయందలి నుడి. తత్కారణమున మా స్మరణ ఫలించెను. అనుకొంటిమి, బండికదలినది. శ్రీధరుడందలి మాకు ప్రత్యక్షమయ్యెను. ఆపన్నరక్షకుడా యన్నట్లు అతని సానుప్రసదృష్టి నిలువజాలక నిలచియున్నవారిపై ప్రసరించెను. సానుక్రోశదృష్టికూర్చున్న ఆరక్షకభటులపైన మా మనంబులు కొంతయూరడిల్లెను. అతడు నన్నుసమీపించి సమాచారమడిగెను. ఇంక నాఆనందమునకు మేరయుండునా? జరిగినదంతయు పూసగుచ్చినట్లు నేనాతనికి నివేదించితిని. అతడంతట భటులదిక్కు తిరిగి

4 May I know where you are going?
అని ప్రశ్నించెను.

5 Why do you care?
అని వెంటనే ఆ భటుని యెదురుకోలు.

6 Because I find you with your baggage on your benches as though you are going to get down at the next station.
అని శ్రీధరుడు డీకొనెను.

---

4. మీ రెక్కడకు వెళ్ళుచున్నారు? 5. నీకెందుకు?
6. మీరు పక్కస్టేషనులోదిగిపోయేవాళ్ళలాగ సామానుబల్లమీద పెట్టుకుంటే

7 No? we are going upto Bhimadol.
అని వారిలో నొకపిన్న పెద్ద సమాధానమిచ్చెను.

శ్రీ:-8 Well, is it proper on your part to make so many people stand by keeping your bag and baggage on the benches?

ఒక భటుడు:-9 Well we can not help it.

శ్రీ:-10 That's not it. If you only will, you can certainly help him.

2వ భటుడు:-11 How?

శ్రీ:-12 You see, if you place your baggage on the top boards, you can certainly provide accommodation for all the standing people.

3వ భటుడు;-13 Oh! Bloody thing! Who will do i now?

---

7. లేదు. మేము భీమడోలు వెళ్ళుచున్నాము.

8. మీసామానులుబల్లలమీద పెట్టుకొని ఈవిధంగా యింతమంది ప్రయాణీకులను నిలుచుండబెట్టటం మీకు ధర్మమా?

9. దానికి మేమేమీ చేయలేము.

10. అల్లాకాదు. మీరు కావాలంటే సహాయం చేయవచ్చు.

11. ఎల్లాగు?

12. మీరు మీసామానుల్ల పైబల్లమీద పెడితే తప్పకుండ యీ నిలుచున్న వారందరికి స్థలం దొరుకుతుంది.

13. అబ్బో! యిప్పు డెవరుచేస్తారు ఆ పాడుపని?

శ్రీ:-14 Come on, I will help you, if you can't really do it. The only thing is, I do not want to bring this matter to your sergeant's notice. He is my personal friend and we both were put up in the same building for ten years. You know, he is a terrible man in dealing with such irregularities.

ఈ తుదిపలుకులు చెవిని బడగానే వారిమొగములు మరింత తెల్లవోయెను. మత్తేభమునకు అంకుశపు పోటు చందమయ్యెను. వెనువెంటనే వారి బిగువు బింకములు పలాయన మంత్రము పఠించినవి. ఇక చెప్పవలయునా? వారి సామానులు వారే బల్లలపైనుంచి ఒకవైపు సర్దుకొని కూర్చుండిరి. అంత మాపెట్టె యింకింత యుబికెను. నిలచియున్న వారికి, 15 'Please sit down' అని ఆభటుల ఆహ్వానము. ఆహా! క్షణములో నెంతమార్పు! అప్పుడు శ్రీధర నామాస్మరణ మందరి జిహ్వాగ్రమున చెలరేగకుండునా? ప్రయాణికుల నోరు లిప్పుడు విడివడినవి-

1 ప్ర:- అయ్యా, వాళ్ళంతా దొరలుగదా, సెకండుక్లాసులో కూర్చోకుండ యిక్కడి కొచ్చారెందుకో!

---

14. పట్టండి, నేను సహాయంచేస్తాను మీకు మీరే చేయలేకపోతే. అసలు నాకు ఈ విషయం మీ సార్జంటుకు తెలియజేయడానికి యిష్టంలేదు. అతడు నాకు ప్రియమిత్రుడు. అతడు నేను పదిసంవత్సరముల పాటు ఒకబిల్డింగ్లో ఉన్నాము. ఇటువంటివిషయాలలో అయన చాలాకఠిన చర్య పుచ్చుకుంటాడుసుమా.

15. దయచేసి కూర్చోండి.

శ్రీ:- వాళ్ళు తెల్లదొరలుకాదు, నల్లదొరలే. వారిని గోవా నీస్ అంటారు. వారు మనదేశములో పశ్చిమభాగమున నున్న గోవా అను ప్రదేశానికిచెందినవారు. అందువల్లనే వాళ్ళు మన తర్డుక్లాసు పెట్టెలో కూర్చోవలసివచ్చింది. ఇంగ్లీషువాళ్ళైతే యిక్కడ కూర్చోనే కూర్చోరు. మనం వీళ్ళకి అస్పృశ్యులమైతే వీళ్ళు అసలు దొరలకు అస్పృశ్యులు.

2 ప్ర- మంచిమాటన్నారు. అయినప్పటికీ దొరతనమువారు వీరికి అధికారమిచ్చారు. అందువల్ల వీళ్ళకిష్టమొచ్చినట్లు చలాయించుతారు.

శ్రీ:- అధికారముంటేమాత్రం యిల్లా ప్రయాణికులకు వత్తిడి కలుగజేయమని యెక్కడన్నా ఉందా యేమండి? వాళ్ళు. అధికారం దేనిలోవుందో దానిలోనేఉపయోగించుకోవాలి గాని వాళ్ళవికానిపనులలో జోక్యంకలుగచేసుకోటం ధర్మ మాయేమిటి? విదేశాలలో చూడండి జంకు గొంకు లేకుండ ఉన్నారు జనులు. అందువలన వాళ్ళకు దేశభక్తి లేకుండా పోయిందాఅంటే, వాళ్ళుమనకన్న యెక్కువదేశభక్తులు. దేశ సంరక్షణార్థం వాళ్ళు ప్రాణాల నర్పించటానికైన సిద్ధంగా ఉన్నారు.

2 ప్ర:- అయ్యా మన కటువంటి దౌర్జన్యఉద్యమాలు వద్దు లేండి. అహింసయే మనకు పరమధర్మము. చూశారా యీ యుద్ధాలను గురించి ఒక విదేశపత్రిక యేమని గోల పెడుతూందో?

సీ॥ పోయెనే ధర్మవిస్ఫూర్తి లోకమునందు
ధర్మశీలురకింక దారిలేదె!
మారెనే మోక్షసామ్రాజ్యాభిలాషలు
ధరను తాపసులకు తెరువులేదె!
సమసిపోయెనె నైజ శాంతగుణంబులు
పశుబలంబే మన పాలబడెనె!
ప్రాప్తించెనే పాపవర్తన నరులకు
కలిశక్తి భువిపైన ఘనతగనెనె!

గీ॥ చెలగి మారణమంత్రమే యిల సమస్త
దేశములకును మంత్రమై తేజరిలెనె!
సాధుజనరక్షణంబింక సాగిరాదె!
కడను లోకంబు నరకలోకంబెయగునె! 29

మరియు ఓ దేశనాయకులారా! భూపాలులారా!

సీ॥ మతరాజకీయాది యితర హేతువులచే
మారణకలహముల్ మానరయ్య,
జగమునగలయట్టి సకలదేశస్థులు
నాయుధంబుల త్రోసివేయుడయ్య,
సంగ్రామమొనరించి సర్వనాశనములో
వేనవేల్ దేశముల్ గానరయ్య?
ధర్మముచే తీర్పదగు భేదములకునై
రక్తపాతముచేయ యుక్తమయ్య?

గీ॥ ఇంక యుద్ధోపకరణములెల్ల మీరు
రూపుమాపి యన్యోన్య విరోధవాంఛ

లంతరింపంగ జేసి, మీ యాత్మలందు
శాంతిగనరయ్య సకలదేశస్థులార! 30

శ్రీ:—సీ॥ ఎన్ని యంత్రముల గన్గొన్నను ఫలమేమి
సదుపయోగాపేక్ష చాలకున్న?
నవనాగరికతచే నవ్యవైభవమేమి
సన్మార్గవర్తన స్వల్పమైన?
మతవిచారంబెంత మహిమిండియునునేమి
ధర్మావలంబన తగ్గుచున్న?
భ్రాతృభావోద్బోధ ఫలమెంచగానేమి
యన్యోన్యవైరంబు లలరుచున్న?

గీ॥ ఇన్నియేలను మానవుడెన్నియైన
నాత్మపరిశోధనల జేయనోపుగాక,
సత్త్వవర్తనవిడనాడి సంచరింప
ధాత్రియంతయు నరకమైదనరుగాదె?

చూచితిరా! ఒకవంక యీయిరువురి ధర్మవిచార విమర్శనము. మరొకవంక ఆభటుల ధూమపానాదులందలి మగ్న విహారము. యోచింప వీని యందే ప్రకృతి లక్షణము కానవచ్చెడుకదా! ఈ గోష్ఠియందు మునిగిన వారిని భీమడోలు మేల్కొలిపెను. ఇదేమి అప్పుడేవచ్చినదా యని వారికాశ్చర్య మొదవెను. ఆయోధులు శ్రీధరరావుగారినుండి సెలవు గైకొని సహాజాట్టహాసములతో నిష్క్రమించిరి. శ్రీధరు డించుక విశ్రమించెను. స్వాములవారును ఆతప తీక్ష్ణతకు తాళజాలక నడుమువాల్చిరి.

---

# కుక్షింభరిత్వపు.

—(౦)—

ఏలూరు నందువలె భీమడోలులో కూడ బండి సావ ధానముగ నాగునని తలంచితిని. కాని యెక్కుడు దిగుడు నంతలోనే ఘంటానాదము వీనులసోకెను. గార్డు తన శంఖ మును పూరించెను. ధూమశకట యంత్రమంతట తన పాంచ జన్యమును పూరించుచు మరల తన దిగ్విజయ సంగ్రామము నుపక్రమించెను. అప్పుడు మా పెట్టెయందలి మరుగుపెట్టె కవాట మకస్మాత్తుగ తెరువబడెను. దాని నుండెవ్వరు ప్రవేశించిరి? ఒక యాచకద్వయము. వారి హీనస్థితిని పొడ గాంచినంతనే నా హృదయమున సప్రితిహత విషాదపూరిత భావతరంగము లుద్భవించి నన్నింంచుక కలవరపఱచినవి. నే నప్పు డాత్మగతమున నిట్లు విచారింప దొడగితిని. "అకటా! యీ ప్రపంచమున పరమేశ్వరు సృష్టిని పరీక్షించిన కొలది అత్యంత విషాదవిస్మయంబులు గలుగునుకదా! ఒక దిక్కు యేడుపు, మరొక దిక్కు నవ్వు. ఒకజాడ అష్టైశ్వర్యాను భవము. వేరొక వంక రౌరవ నరక తుల్యమగు దరిద్రాను భవము. ఈ జగన్నాటకమున ప్రతి జీవికిని ఒకటియున్నచో మరొకటి లేక, పిపీలికాది బ్రహ్మపర్యంతము, సర్వ చరాచర స్థావర జంగమంబులును ఆ సృష్టి స్థితి లయకారకులచే అసం పూర్ణజీవులు గను, అస్వతంత్ర వస్తువులుగను గావింపబడి యెనే! విచారింప నేత్రద్వయమున్న పూరుషునకు చరణము లుండవు! ఈ రెండును కలిగినవానికి అంగ సౌష్ఠవముండదు. అంగసౌష్ఠవమున్నచో ఆయుర్దాయముండదు! ఆయుర్దాయ

ముండిన అన్నవస్త్రాదులుండవు! అన్నవస్త్రములు లభించిన ఆనందించుటకు సంతానముండదు! ఇవి యన్నియు కలిగినను అనుభవించుటకు యోగముండదు! ఇదియేజీవిత వైపరీత్యము! ప్రపంచ రహస్యము! సృష్టియందలి మూలసూత్రము! ఔరా! యీ విపరీతమున కేమనవలయు? అయినను దేవుని దూషించి యేమిఫలము? ఇందలి దెవరి తప్పు? ఎవరు చేసిన పాపము వారిని కట్టి కుడుపుచుండునేగాని వేరుకాదు. కావున పాపపుణ్య కర్తలమగు మనకీ సుఖదుఃఖానుభవము లెన్నటికిని తప్పవు.'' ఇట్లు మనంబున కొంతవడి తర్కించుకొని యూరడిల్లితిని.

ఆనాడు బండిలో మేము చూచిన దృశ్య మత్యంత హృదయదారకమైనదని నుడువుట చర్వితచర్వణమేయగును. వారిరువురిలో నొకడు ప్రాయము చెల్లినవాడు. రమారమి నలుబదేండ్లుండవచ్చును. వాని భుజములపై నొక పదిసంవత్సరముల పిల్ల కూర్చునియుండెను. బహుశః ఆతనికూతురై యుండనోపు. వానికి యెడమచెయ్యి మొండిది. అపరము పూర్తిగా నుండెను. కరములకు హెచ్చు తగ్గులు పెట్టిన ఆ బ్రహ్మ కండ్లకు కూడ నేల పెట్టకూడదు! రెండును లేకుండ జేసినాడే! కండ్లులేవు గనుక ముక్కువిషయ మంతగా యోచింప నక్కఱలేదు. అందుచే నాతనిమాట స్పష్టముగ లేకుండెను. ఇక ఆ బాలికనుచూడ నంతయు తలక్రిందులే. ఆమెకు కాళ్ళు రెండును మొండివి. తక్కిన యవయవములు మాత్రము కలవు. ఇట్టివారినేల సృష్టించెనో దైవము! ఆతని విచిత్రసృష్టి లీలామహిమ నెఱుంగ నలంతులకు నలవియగునె? విచారింప నే వస్తువును గుణరహితము కాదు. వీరి చెడుగు

నందును గుణములేకపోలేదు. పరస్పర సహాకారమును వీరియం దెంత ముచ్చటగ పోషించినాడో? ఈ తత్వమును ప్రపంచ మున చాటుటకే వీరిన్వర నివ్విధమున సృష్టించె గాబోలు.. వీరుభయులు కలసిననేగాని నడచుటకు చూచుటకు మాట లాడుటకు తగిన యొకమానిసి కాలేదు. పైనున్న పిల్ల పోవల సిన దారిని చూచి వానికి చెప్పుచుండును. వాఁడా పిల్ల చెప్పి నటుల నడచి పోవు చుండును. ఇట్లొకరి లోపము నొకరు పూర్తిచేసికొనుచు పరస్పర సహాకారముతో తండ్రి కూతురు లైన వారిరువురు ప్రాణములు నిలబెట్టుకొను చున్నారు. పాపము యీ ధరణిలో వారీ పనిని దక్క వేరేపనిని చేయ గలరు?

ప్ర:- అబ్బ, యెక్కడచూచినా వీళ్ళేనండీ! ఇంటిదగ్గరవీళ్ళే! బజారులోను వీళ్ళే! చివరకు బండిలోనన్నా కాసేపు హాయిగా కూర్చుందామంటే, యిక్కడకూ తయారైనారు!

నేను:-అయ్యా! ఈప్రపంచములో యాచకులలో కూడ చాల రకరకాల వాళ్లున్నారు. ఎల్లాగంటే

సీ॥ కష్టింపనొల్లక కడునీచయాచన
తమయింటి హక్కుగా దలచువారు,
అంగవికలత జీవనాధార శూన్యులై
'దేహి' యటంచు నర్థించువారు,
కూలినాలియునై నగోర నొసంగువా
రెలమి లేమిని బిచ్చమెత్తువారు,
భర్తృవియోగులై భరియించువారలు

గానమి యాచన పూనువారు,

గీ॥ కలవు కోటానుకోటులీ కలియుగమున,
నెల్లజనులకు తగురీతి వృత్తులొసగి,
జీవనాధారమిచ్చి పోషింపదగును,
కలియుగంబున యాచనతొలగనగును॥

నేనిట్లు చెప్పినపిమ్మట మాకెదుటిబల్లపై కూర్చున్న ఒక శ్రీమంతుడు నావంకజూచి 'ఏమండీ, యాచకత్వము తొలగిపోవాలన్నారుగాని, దీనినితొలగించడానికి యెవరికి సాధ్యమవుతుందండీ!' అని పలికిరి. అప్పుడాతని పరిచయుడొకడు నాకు మారు ప్రత్యుత్తర మొసగెను.

పరిచయుడు:- ఎవ్వరికీ సాధ్యము కాకపోవడమేమిటండీ! మీవంటి శ్రీమంతుల కిది అసాధ్యమైన పనికాదు. మీకు తెలియనిదేముంది?

సీ॥ సత్కర్మలకుగాని సంపద సంపదే
కూడబెట్టినరోతకుప్పగాక,
సదుపయోగములేని జ్ఞానంబు జ్ఞానమే
పాలిచ్చిపెంచిన పాముగాక,
సాధురక్షణలేని శక్తియు శక్తియే
కర్కశబ్రహ్మరాక్షసియెగాక,
సాహసమతిలేని జన్మంబు జన్మమే
సారహీనంపు వృక్షంబుగాక.

గీ॥ వలయుసత్కార్యములకు నెప్పగిదినైన
సిరియు శేముషీ వినియోగపరుపవలయు,
నవనిజన్మించి ఫలమేమి ఖ్యాతిలేక

పోవుతఱి నేవియును వెంట రావు రావు॥

మేమిట్లు ముచ్చటించుకొనుచుండ నింతలో నాయాచకులు తమ కార్యమును ముగించుకొని ద్వారమువద్ద రాబోవు స్టేషనుకై వేచియుండిరి. మొదట యాచకసమస్యనుండి వారు యితరవిషయములలోనికి పోవుటగమనించి నేనువారిపలుకులు పురస్కరించుకొని మాట్లాడ మొదలిడితిని. అచ్చటివారేమో చెప్పనుంకించిరి. కాని యింతలో నొక బాలుడు, 'తాడేపల్లిగూడెం వచ్చిందే నాయనమ్మా, లేవే, తొందరగా దిగాలి' అని అరచెను. అతనిది కలవరమేమో యనుకొంటిని. కాని పరికింప నిజమయ్యెను. బండియాగెను. అంతట మాసిద్ధాంత రాద్ధాంతములు ముగిసినవి.

## కమలాబాయమ్మగారు

"అదృష్టవంతుని చెడగొట్ట లేరు, దురదృష్ట వంతుని బాగుపరచలేరు" అను లోకోక్తి యదార్థము. ఇదేటిచిత్రమో గాని ప్రపంచమున మానవునికి వచ్చినచో సంపదల వెంట సంపదలు నిరాటంకముగ వచ్చును. లేక గ్రహస్థితి బాగుండనిచో కష్టములు వెనుక కష్టములు వచ్చి, వానిని పాతాళలోకమున కణగద్రొక్కును. మంచికాలమునకు మాధవుడేనియు మనుజుని చెరుపలేడు. దురదృష్టము తొంగిచూచిన దేవేంద్రుడైనను చేతులు జోడించవలసినదే. ఇది కదా విధి వైచిత్ర్యము. అద్దాని యాగ్రహానుగ్రహము లనివార్యము లనుట దబ్బరయగునా?

ఆనాడు మామేనల్లుని ప్రోద్బలమువలన నేనాబండిలో మాయూరికి బయలుదేరితిని. ఆవేళావిశేషముననో, నాభాగ్య

వశముననో, లేక కేవలము ప్రమాదవశముననో, మరల నాలు
గేండ్ల కానాడు శ్రీధరుని దర్శించితిని. బండి బెజవాడ నుండి
బయలుదేరినది మొదలు చిత్రముగ నేదో యొక సద్విషయ
మును గూర్చి యెవరైన హృద్యముగ మాట్లాడుచు వచ్చిరి.
ఇట్లు నాటకమునందలి రంగములమాడ్కి ఒకఘట్టము పిమ్మట
మరియొక ఘట్టము అప్రయత్నముగ నా ప్రయాణ కాలమున
జరుగుటయు, నాకు అందమిట్లోత్సాహ ముంటయు, యో
చింప విధివిలాసమే యని చెప్పవలసియున్నది.

తాడేపల్లిగూడెముకడ మా పెట్టెయం దొక వృద్ధురా
లెక్కెను. ఆమె వెంట దాదా పిరువదేండ్ల ప్రాయముగల
యిర్వురు యువతీమణులు కూడ నెక్కిరి. నవనాగరిక శిఖా
మణులగు వీరుభయులు మా పెట్టెయం దెల్లర దృష్టి నాకర్షిం
చిరి. పురుషులుకానిండు, స్త్రీలుకానిండు, ధనికులుకానిండు,
దరిద్రులు కానిండు, పెద్దలుకానిండు, పిన్నలుకానిండు వారు
దేశకాలసంప్రదాయానుసారములైన వేషభాషాదుల మెలఁగి
నపుడే గౌరవమును బడయగలరు. ఆ యువతుల వసనధారణ
విధానమును, ఆభరణవైచిత్ర్యమును చర్చింప సోదరీ లోకము
చిన్నబోవునని విరమింపవలసి వచ్చెను. అందందు పురుషుల
యెడ సహిత మిట్టి విపరీత వేషములు లేకపోలేదు. వాని
నిందు విమర్శింప మాకే పరాభవ మగునని వేరుగ చెప్పనేల?
ఇరువురయందును నిట్టి యాడంబరపు వేషములు హాస్యాస్ప
దము లగుటం జేసియే నేనింత చెప్పవలసి వచ్చెను.

ఈ మహిళామణులెక్కిన యుత్తర క్షణముననే బండి

తన వేగమును చూపింపసాగెను. అంతట ప్రయాణికులు తమ వాక్చాతుర్యమును ప్రకటింప దొడగిరి.

1 ప్ర:- (వృద్ధురాలితో) ఏమండోయ్ ! కమలాబాయమ్మ గారూ, యెప్పుడొచ్చారేంటి తాడేపల్లిగూడెం ?

క:- నాయనా ! మొన్నవచ్చాను. ఇప్పుడుతిరిగి రాజమండ్రి వెడుతున్నాను.

1 ప్ర:- ఏమి? యిక్కడేమైనా సభ చేశారా యేమిటి?

క:- అవును, నిన్న సాయంకాలము యిక్కడ ఒక మహిళా మండలిని యేర్పాటుచేసి దాని తరఫున ఒక సభచేశాము.

1 ప్ర:- సభ బాగా జరిగిందా ?

క:- బాగానే జరిగింది.

2 ప్ర:- ఓహో యీామేనా కమలాబాయమ్మగారంటే ! ఏమమ్మా తల్లీ, చాలా వృద్ధురాలవుకదా, యెందుకమ్మా నీకీ అనవసర శ్రమ! ఎంత బోధించినా ఆడవాళ్ళపని ఆడవాళ్ళకు తప్పుతుందా? మగవాళ్ళపని మగవాళ్ళకు తప్పుతుందా ?

క:- (శాంతముగ) నాయనా ! అల్లాకాదు. నేను స్త్రీలకు మగవాళ్ళ పైన యెదురు తిరగమని గాని, తమ పనులు మానుమనిగానిబోధించడంలేదు. కాని వారిసంఘసౌభాగ్యమునకును వ్యక్తిసౌభాగ్యమునకును తగిన బోధనలు మాత్రమే చేస్తున్నాను. ఇందులో దోషమేమున్నది? దీని వలన స్త్రీలు మగవారికి మరింత తెలివితేటలతో సహాయభూతులుకాగలరు. అంతేకాదు, ఉత్తమదేశ సేవకులుకూడ కాగలరు. అందువలన క్రమ క్రమముగ మన సంఘము

బాగుపడుతుంది.. మన దేశసౌభాగ్యము కూడ వృద్ధి అవు తుంది. కాబట్టి దీనివల్ల మగవారికి లాభమేకాని నష్టము లేదు.

2 ప్రి:- ఇదేమిటమ్మా! ఇది యెదురుతిరగటం కాదటమ్మా? ఇంకా యింతకన్నా యేమికావాలి? ఫేసుపౌడర్లు, పక్క పాపటలు, చేతులులేని రవికలు, యివన్నీ ఉత్తమస్త్రీలకు తగిన వేనటమ్మా?.

క:- ఆమాట నిజమే. ఇవన్నీ చేయండని నేను వాళ్ళకు బోధించడంలేదు. కాని అటువంటి వాళ్ళకు హితము చెప్పి వాళ్ళను మన సంప్రదాయాలలో పెట్టటానికే నేను ప్రియత్నముచేస్తున్నది కూడాను. ఈ పిల్లలు యీవూరి వారే. వీళ్ళను ప్రత్యేకంగా నాతో తీసుకొని వెళ్ళడం, మారాజ మండిరిలో కొంతమంది ఉత్తమ బాలికలను వీళ్ళకు చూపించి, వీళ్ళకు యీ విపరీతవస్త్రధారణముమీద వ్యామోహము పోయేటట్లు చేయటానికే.

2 ప్రి:- ఇవన్నీ పనికిరావని ఒప్పుకున్నారుగదా? సరేఅయితే.

క:- నాయనా, నే నెక్కడికి పోయినా సదుపదేశాలే చేస్తున్నానుగాని దురుపదేశాలు చేస్తున్నానని యెప్పటికీ అనుకోవద్దు.

సీ॥ బాలికలకు వలయు పావనంబగు విద్య
లొసగి లోకజ్ఞాన మొసగవలయు,
బాల్యవివాహముల్ వారించి ఘోరమౌ
బాల్యవైధవ్యంబు బాపవలయు,
తగురీతి పిత్రార్జితము కొంత నొసగియు

జీవనోపాధి హెచ్చింపవలయు,
తరుణుల వీరమాతలు వీరపత్ను లు
త్తమ స్త్రీలుగా జేసి దనరవలయు,
గీ॥ అవని స్త్రీ సంఘసంస్కార మాచరించి
భరతమాతకు గౌరవప్రదముగాను
సర్వతోముఖ సౌభాగ్య సత్ఫలంబు
పొందవలయును భారతపుత్రులెల్ల ॥

ఇంతలో శ్రీధరరావుగారు మేల్కాంచిరి. వెంటనే కమలాబాయమ్మగారు "ఎక్కడనుంచి వస్తున్నారు అన్న గారు?" అని యతనినడిగెను. 'ఓహో! కమలాబాయమ్మగారా! నేను గుంటూరినుంచి వస్తున్నాను' అని అతడు బదులాడెను. అంతట వారుభయులు కొంతవడి వారివారి ప్రచారములను గూర్చి మాటలాడుకొనసాగిరి.

అప్పుడు కొందరు ప్రయాణికులు తమ సామగ్రిని చేత ద్వారములకడ నిలువబడిరి. ఇంతలో వెలుపలనున్న ప్రయాణికుల కలకలనాదము వీనులసోకెను. 'నిడదవోలు వచ్చిన' దను లోనివారి హెచ్చరిక వారి యిష్టాగోష్ఠికి మంగళము పాడినది. ఇట్టియెడ స్వాములవారు మాత్రము మేల్కాంచ కుందురా?

---

# హితబోధినీ పరిచయము

యోచింప ధూమశకట ప్రయాణము మన జీవయాత్ర కు ప్రతిబింబమే యనదగును. ఈ తత్వము నాకు నాటి రైలు ప్రయాణమున గొప్ప తార్కాణమై కన్పట్టినది. జీవితమున

నాయాదశలలో గలుగు మార్పుల చొప్పుననే బండి ప్రేష నులయం దాగుచున్నతటి నాడు సంభవించిన సంఘటన లనుక రించినవి. వేయేల? నే నానాటి పయనమున వివిధ విశేషములు గాంచితిని, చిత్రవిచిత్రములగు ననుభవముల బొందితిని, అతు లితానంద విషాదముల చవిచూచితిని. నిక్కముగ నాకు కలుగు ఘటనా పరంపరల కక్కజ మొదవ మిక్కుటంబగు తమక్కువతో ముందేమి రానున్నదో చూడ నుత్సాహ మూగుచుంటిని.

ఆరోజున ప్రత్యేకముగ నేదో హేతువుచే మా బండి నిడదవోలులో ఆగిపోయెను. మేమెల్లరము మరియొకబండిలో వెళ్ళవలయునని రైలు అధికారులు తెలియజేయ మేమటనుండి దిగితిమి. కాని మార్గమధ్యమున నతివృష్టి యగుటచే మా కొరకు ప్రత్యేకముగ నాడు నరసాపురము నుండి రావలసిన బండి రాక తడసినది. ఆతురముతో నున్న మాకు బండి రాని కారణమున కొంత జుగుప్సకలుగుట సహజమే. మా జుగుప్స నింకింత చెలరేగించినది, మరొక గంటదనుక బండి రాదని యధికారులు తెలిపిన వార్త. అంత కొందరందందు తమ సామగ్రితో కూరుచుండిరి. మరికొందరల్పాహారశాలల కరి గిరి. కొందరటునిటు వాహ్యాళి జరుపుచుండిరి. మరికొందఱూ రిలోనున్న తమ బందుగుల చూచిరావెడలిరి. కాని యేమి చేయుటకును నాకు పాలుపోకుండెను. శ్రీధరరావు నెయి టింగురూములో నేదో వ్రాసికొనుచు కూర్చుండెను. కమలా బాయమ్మగా రెక్కడ కూర్చుండిరో కానరాలేదు. వేరొక వంక బయట స్వాములవారేదో చదువుచు సుఖాసీనులైరి.

అంత సూరక గుటకలు మ్రింగుటకన్న వారితోడ ప్రసంగ మెంతయు మేలొనగూర్చునని యెంచి వారికడకేగి ప్రణమిల్లి తిని. 'కృష్ణార్పణం' అనుచు ఆ స్వాములవారు నన్ను కూర్చుండ నియమించిరి. ఇంతలో నామేనల్లుడు బాలకుడగుటచే తన చాపల్యమును తీర్చుకొన అంగడియొద్దకు పరుగిడెను.

స్వా:- మీ రెక్కడికి వెడుతున్నారు?

నేను:- తునికి స్వామి.

స్వా:- ఊఁ సరీ

నేను:- మీ చేతిలో గ్రంథమేమిటి స్వామి?

స్వా:- ఇది 'హితబోధిని' అనే గ్రంథము.

నేను:- ఓహో యెవరు వ్రాసిందండీ?

స్వా:- ఇది మాజిల్లా ఆయన వ్రాసిందే, కృష్ణరావుగారని.

నేను:- బండి రావటానికి యింకా ఒక గంట వ్యవధి వుంది. కొంచెముసేపు ఆ పుస్తకం చదువుతారా స్వామీ, దయ చేసి?

స్వా:- అట్లాగే. ఇంతకు ముందు యిదే చదువుచుంటిని. వినండి, చదువుతాను.

నేను:- చిత్తం.

స్వా:- సత్య అహింసలను గురించి ప్రబోధముచేస్తున్నాడీకవి. మనశాస్త్రములందు బోధింపబడిన ముఖ్య ధర్మములే యివి. చూచినారా యీ నిర్వాచనము? త్యాగులకే ధర్మ తత్వము తెలియునుగాని తృష్ణగల వారికి తెలియదు. సంపూర్ణమగు భక్తికలవారికే భగవద్దర్శనము కలుగునుగాని చంచలభక్తిగలవారికి కలుగదు. కష్టములనుదార్కొని ఓర్పు

త్రోను తెలివితేటలతోను వాటిని గెల్చిన వారికే ఘనత వచ్చునుగాని కష్టములకులొంగి పాటుపడనివారికి ఘనతరాదు. సజ్జనులను రక్షించిన వారలే లోకవంద్యు లగుదురుగాని స్వప్రయోజనపరులై యితరుల క్షేమము విచారింపని వారు లోకవంద్యులు కారు.

నేను:- అయితే దేవుడుకూడా ధర్మపక్షపాతి అంటారుకదండీ? భగవద్గీతలో,

'యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్.
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే.'

అని చెప్పబడి యుండికదండీ!

స్వా:- అవును, భగవంతుడు ధర్మపక్షపాతియనుట ముమ్మాటికి నిజమే. ఆయన దుష్టులశిక్షించును, శిష్టులరక్షించును అనగా ఆయనఅందరిని సమానముగ ప్రేమించును. కాని వారు దుష్టమార్గమును తొక్కకుండునటుల శిక్షించు చుండును. తప్పు చేసిన తనకుమారు నొకని శిక్షించినంత మాత్రమున తండ్రికి ఆ కుమారుని యందు ప్రేమ లేదని చెప్పగలమా? నేరస్థుడగు నొకనిని శిక్షించినంత మాత్రమున న్యాయాధిపతికి ఆతని యందు క్రోధము కలదని వాదించగలమా? అట్లే దేవుని ప్రేమనుగూడ భావించవలెను. ప్రేమ వేరు, ధర్మము వేరు.

నేను:- దేవుడు అందరినీ సమానమైనప్రేమతో చూస్తున్నప్పటికీ అందరికీ సమానమైన సుఖదుఃఖాలు యివ్వడుకదండీ!

స్వా:- అవును, తండ్రి సమానదృష్టితో ప్రేమిస్తున్నప్పటికీ పిల్లలు సమానముగ సుఖదుఃఖము లనుభవిస్తున్నారా? నాయనా! కాబట్టి యెవరుచేసుకున్న కర్మల ననుసరించి వారు సుఖదుఃఖాలు అనుభవించాలిసిందే. కాని దానికి భగవంతుడికీ సంబంధము పెట్టరాదు. వేపవిత్తునాటి మామిడిపండు రావలెనంటే వస్తుందా? లేక మామిడివిత్తునాటి వేపకాయ రావలెనంటే వస్తుందా? అందువల్లనే మన పురాణేతి హాసాలలో,

సీ॥ భువియెల్ల నొక నాట్యభూమియై దనరంగ
నిటజీవులెల్లరు నటులుగాగ,
వారివారికి తగుపాత్రలధరియించి
యరుదెంతురిటకు నాట్యంబుసల్ప,
సత్కర్మలను జేయ సత్ఫలంబునుగాంత్రు
దుష్కర్మములొనర్ప దుఃఖపడుదు,
రీనాటకంబున కెల్ల నాథుండగు
నత డెల్లజీవుల యాత్మలందు

గీ॥ వెలసియున్నాడు కాన పవిత్రదీక్ష
బూజసల్పుచు, సత్కర్మములను సల్పి
పుణ్యమార్గంబుచేముక్తి పొందరయ్య
భవ్యమతులార! సుగుణసంపన్నులార!

అని చెప్పబడియున్నది. మన పూర్వపు మహానీయులూ యీ కర్మసూత్ర రహస్యమును గమనించియే మనబోటివారూ పాపకర్మలకు లోబడకుండునట్లు,

సీ॥ జేనెడుపొట్టకై పూనియన్యాయముల్
సేయుచుండుట సౌఖ్యదాయకంబె?
పలుపాపములొనర్చి నిలువచేసినయట్టి
సంపదమనలకు శాశ్వతంబె?
బంధుమిత్రులప్రీతి బడయంగ సల్పెడు
కూ్రరచేష్టలు పుణ్యకారకములె?
మణిమాన్యములు మేలి మందిరరాజముల్
చిరసుఖదంబులై వఱలగలవె?

గీ॥ దృశ్యవస్తువులెల్ల నదృశ్యములగు.
ధర్మమొక్కటె చిరము మోదప్రదంబు,
భువి స్వధర్మంబు లొనరించి ముక్తిగనుడి
పుణ్యమతులార! భారతపుత్రులార!.

అని మన పవిత్ర గ్రంథములలో ఘోషించియుండిరి.

నేను:- మనకు ధర్మోపదేశము చాలా ఉన్నదండీ; కాని దానిని అనుష్ఠానములో పెట్టేవారే తక్కువయ్యారు. తగు వాత యేమి పద్యము స్వామీ?.

స్వా:-
సీ॥ అసువులునిల్ప నాహారంబు గొనుగాని
కూర్మిషడ్రసములం గోరబోడు,
వంశంబునిల్ప వివాహ మామోదించు
గాని భోగాపేక్ష పూనబోడు,
అన్యులకై విత్తమార్జించునేగాని
స్వార్థపరుండయి పరలంబోడు,

పామరులకు జ్ఞానభాస్కరంబగు విద్య
బడయుగాని గర్వపడగబోడు.

గీ॥ అట్టిధర్మార్థ కామమోక్షాదులెల్ల
సక్రమంబుగ బడయుచు, జన్మ సఫల
తనుగడింపంగ యత్నించు ఘనతమీర
జ్ఞానసంపన్నుడగునట్టి మానవుండు॥

నేను:- ఓహో! ఇందులో జ్ఞాని యెల్లా ఉండాలో చెప్పినాడు కవి.

స్వా:- ఇందులోని ఉపదేశములు యెక్కువగా మీ వంటి గృహస్థులకు వర్తించునవిగా ఉన్నవి.

నేను:- అవును స్వామి, రెక్కవాలింది.

స్వా:- అట్లాగా, అయితే యీఒక్కపద్యం చదివి ముగిద్దాం.

నేను:- సరే చదవండి.

స్వా:-

సీ॥ రవిగుంకనట్టి సామ్రాజ్యంబు పాలించు
ఘనులగు రాజశేఖరులకైనఁ
జని సభాస్థలి బృహస్పతినైన నోడించు
దారుణపండితోత్తములకైన
దానధర్మాది తత్పర శిఖామణులౌచు
దనరు సత్కర్మపావనులకైనఁ
బరమయోగాభ్యాసగరిమచే నొప్పారు
విమలయోగీంద్ర బృందములకైన

గీ॥ ధరను తప్పవుగా జరామరణ పాప
పుణ్యములు, కష్టసుఖము, లిప్పుడమి నెంత

వారికైనను, జీవుడా! పరగ నీకె
కాదు; భువిధర్మమిదిగాన ఖేదపడకు॥

పిమ్మట నా మేనల్లుడు, 'బండివస్తోంది మామయ్యా!' అనుచు మాకడకు పరుగిడివచ్చెను. ఇంకెక్కడితత్త్వవిచారము! లేచి గుంపునందు కలసిపోతిమి. ఆలస్యమున కపరాధమో యన్నట్లు ధూమశకటము విద్యుద్వేగమున వచ్చి స్టేషనులో నిలచెను.



## ప్ర బో ధ ము

కార్యము ఫలింప నేను, విఫలింప నాతడు అని క్రమముగ మీసములు దువ్వుటయు, మూలదాగుటయు ప్రపంచమున నిత్యానుభవములు. మొదటిదాని యందహంభావత్వమును, రెండవదానిలో శేషశేషిన్యాయమును వ్యక్తములగును. అప్పుడే 'అన్యథా చింతితం కార్యం దైవమన్యత్ర చింతయేత్' అను సూక్తి మనసునకు దట్టును. విచారింప మొదటివర్గమునకు జేరినవారు తామసులు. రెండవవర్గమునకు చెందినవారు తాపసులు. తొలుత పై చేయి మొదటివారిదే యైనను, చివరకు రెండుచేతులు జోడింపవలసి వచ్చును. కావున పూర్వతత్త్వము కొంత దుస్సహమైనను అది రెండవ తత్త్వమునకు జీవుని దిప్పుచు, ఆతని సన్మార్గవర్తనకు సహకారి యగును. ఇందుకు హిరణ్యకశ్యప రావణాసురులే తార్కాణము. ప్రథమమున సౌఖ్యము ననుభవించి పిమ్మట దుఃఖము పాలగుటకన్న, దుఃఖానంతరము సౌఖ్యము కలుగుట మేలు. ఈ తత్త్వమును గ్రహించియే జయ విజయులు మొదట తామస

వృత్తినిపూని పిమ్మట సర్వేశ్వరునికటాక్షమున శాశ్వతానంద సుఖముల జూఱగొనిరి. ఎవ్వడీ తత్వమును గమనించునో వాడే నిక్కముగ ధన్యుడగును.

స్వాములవారి సాన్నిధ్యమున గొన్ని మహద్విషయముల వినిన పిమ్మట వా రెక్కెడి పెట్టెయందే నేనును కూర్చుండ నిశ్చయించుకొంటిని. కాని తానొకటి తలచిన దైవమొకటి తలచును గదా! నా కోరిక యీడేరదయ్యె. ఇందులకు కారణము నా మేనల్లుని కొందలపాటు. అప్పటి దనుక నూరక నిలచియున్నవాడు-బండి స్టేషనులో బ్రవేశించు నప్పటికి 'ఆ బొమ్మ కొనిపెట్టవు మామయ్యా' అని చేయి పట్టుకొని నన్ను అంగడియొద్దకు గొనిపోయెను. వానినప్పుడు గద్దించిన కంటె కాలువకట్ట తెగునను భయమున వానివెంబడించితిని. ఆ పని పూర్తిగావించుకొని తిరిగి వచ్చునంతలో స్వాములవారొక పెట్టెలో నెక్కి కూర్చుండిరి. అప్పటికే ఆ పెట్టెయందు తావులేమింజేసి పెక్కురు నిలచి యుండిరి. ఇక నా కందు స్థలమెక్కడిది ? ఆ దృశ్యమును గాంచినంతనే ఆశాభంగమున నా హృదయము కుంగిపోయెను. గత్యంతర మేమియు తోచక శ్రీధరరావుగారి సాంగత్యమునకైన మెలగ దలచి బండియంతయు వెదకితిని. కాని ఆ మహనీయు డెచ్చటను కానబడడయ్యె! ఆహా ఉభయభ్రష్టత్వమైనదే! అని చింతించుచు చిట్టచివరకొక పెట్టెయందెక్కి కూర్చుంటిని. అంత నొక పత్రికను కొని దానితో కాలక్షేపముచేయ నిశ్చయించుకొంటిని. కాని అకస్మాత్తుగ నెచ్చటినుండి వచ్చెనో, బండి కదలు సమయమునకు! మరల శ్రీధరుడు మాపెట్టెలో బ్రత్య

క్షమయ్యెను. ఆతని చూచినంతనే చంద్రచకోరన్యాయ
మయ్యెనని వేరుగ చెప్పనేల?

ఇట్టి సందర్భమున నాచూపొకవంక ప్రసరించినది.
ఈ సంతోషాతిశయమున మరొక శృంగారదృశ్యము. నా కిం
చుక దూరమున యెలనాగలు, బహుశః, వారి వర్తనలబట్టి
వెలకాంతలు మెరయుచుండిరి. ఆ క్రీగంటిచూపులు, ఆముసి
ముసినవ్వులు, ఆ కలకలపలుకులు, ఆ పయ్యెదలసారింపులు,
ప్రాయము చెల్లినవారికే కొంత చిత్తచాంచల్యము కలిగి
నపుడు, తరుణ వయస్కులింక తబ్బిబ్బుకాకుందురా? కనుకనే
ఆ ముసలిపెద్దన 'ఇనుపకచ్చడాల్ కట్టుకొను మునిముచ్చు
లెల్ల తామరసనేత్రలిండ్ల బందాలుకారె?' అని వర్ణించెను.
ఆవిలాసినులకు ప్రతివారును తమచూపుల నెదుర్కోలు జరుపు
చుండిరి. శ్మశానవాసియై జటావల్కలముల ధరించి యెల్ల
లోకముల తనకంటిమంటచే మ్రగ్గింపజేయు నాయుగ్రమూర్తి
ఆమోహిని అవ్యక్తరాగాలాపమునకు కండ్లు తెఱచెను. దృ
శ్యమును గాంచినంతనే మనసు చలించెను. ఆమె కొంత విము
ఖత చూపుతరి అతడామెను బ్రతిమాలుకొనెను. అట్టియెడ
మా పెట్టెలోని కొందరి చర్యలను వెలిబుచ్చిన కామశాస్త్ర
మునే నవ్వులపాలుచేసినట్లగును కదా. ఇంతలో ఆ కాంతలలో
పెద్దది - వారిపెద్ద కాబోలు - మగవారికి లజ్జకలిగించు
కంఠస్వరముతో తనపిల్లల పలుకరింప దొడగెను. అప్పటి
జగన్నాటక సూత్రధారిణి యీమెయే.

హేమా:- ఏం బావయ్యగారూ!...నవ్వుతున్నారా?... మా
పిల్లలు కొంచెం అశ్రద్ధమనుషులు లేండి. అందుకని జ్ఞాప

కము చేస్తున్నా గుడ్డలవిషయం సాయంత్రం మేళానికి కావాలిగందా అని.

వ్యక్తి:— ఏ వూ రెడుతుండా రేంటి మీరు ?

వే-మా:— మేమా బావయ్యగారూ! చాగల్లెడుతున్నాం.

' మీరు కూడ అక్కడకే వస్తున్నారా యిప్పుడు ?

వ్యక్తి:— ఆ, సాయంత్రానికి కక్కడికేవస్తాను. అయితేఅక్కడ యెవరింట్లోనన్నా పెళ్ళా ?

వే-మా:— లేదండి, ఇప్పుడక్కడ వుత్సవాలుజరుగుతున్నాయి. దేవాలయములో యివ్వాళ్ళ మా ఆటుంది.

వ్యక్తి:— ఓహో! అన్నట్టు యిప్పుడు చాగల్లులో ఉత్సవాల రోజులుకాదూ! అయితే నేనక్కడ కొస్తాలే.

వే-మా:— (శ్రీధరరావుగారితో) ఎక్కడో చూచినట్టున్నాను బాబియ్యగారు మిమ్మల్ని !

నేను:— ఆయనెవరోనీకు తెలియదల్లేడుందే! శ్రీధరరావుగారు!

వే-మా:— శ్రీధరరావుగారా ? ఏ శ్రీధరరావుగారు ? వారి కేం పనండీ ?

నేను:— సరే, బాగానేవుంది, ఆయన డాక్టరుగారు, సంఘ సంస్కర్తలు.

వే-మా:— ఓహో !

ఒకవ్యక్తి:— మీ వేశ్యావృత్తినికూడ తొలగించి సంఘము నుద్ధరించువారు.

వే-మా:— ఎందుకండీ ? మాపనేదో మేము చూసుకుంటాము గాని యితరులజోలికి వస్తామా యేమన్నానాండీ?

వ్యక్తి:- ఓహో! అల్లాగా! పాపం! అయితే మీవృత్తి మంచిదే అంటావా?

వే-మా:- అయితే బావయ్యగారూ, అల్లా అంటారుగాని మమ్మల నేమి చేయమంటారు చెప్పండి. అనాదిగా మా తాత ముత్తాతలనుండీ వస్తోందాయెను ఈ వృత్తి మాకు. అదీ కాకపోయినా, మాకిది వదిలేస్తే వేరే లేదాయెను? బ్రతకటానికి యేదో ఒకవృత్తి కావాలిగదండీ మరి ప్రపంచంలో?

శ్రీ:- మదరాసులో సేవాసదనమని ఒకరక్షణశాఖ స్థాపింపబడి వుంది, అందులో యే వయసువారైనను చదువుకో వచ్చు, వాళ్ళందరకు చదువు పూరికే చెపుతారు. భోజనం ఉచితంగా పెడతారు. గుడ్డలు గుటుసులు డబ్బులేకుండా యిస్తారు.

వే-మా:-అవునండీ, మాకిల్లా చెప్పేవారులేరు! మాకు స్వతః తెలుసుకునే శక్తి కూడలేదు. ఏదో అందరికిమల్లేనే మా తాతలనాటి వృత్తే మాకు మహా వుత్తమ మనుకొని మూఢత్వంలోపడి ఈవృత్తి సాగిస్తున్నాము!

ఇట్లు వీరుభయులు సంభాషించుచుండ నింతలోబండి చాగల్లుస్టేషనుకు వచ్చిచేరెను. అంతట శ్రీధర మహాశయునికి ప్రణమిల్లి ఆ వేశ్యమాత తనసంతతితో బండిదిగిపోయెను.

2వ వ్యా:-మీరన్నట్లు ఈ వేశ్యలు చాగల్లు దేవాలయవాతావరణాన్ని కలుషితం చేయడానికే పోతున్నారని చెప్పవచ్చు. ఇల్లాగేకాదండీ మన దేవాలయాలన్నీ చెడిపోయి ప్రజలలోకూడా దైవభక్తి పోవడం సంభవిస్తోంది!

శ్రీధరరావుగారింకేమో చెప్పదలచిరి కాని యవకాశ మెక్కడ? బండి జనసమ్మర్దమున నున్న రాజమండ్రిలో తన కాలు నిలిపెను. అచ్చటి ప్రయాణికుల విషయములు వేరుగ నెరుగ నెంతురా?

## విద్యార్థుల ప్రసంగములు.

అవి వేసంగి దినములు. ఒకవంక యుష్ణదేశములనుండి తమ దేహమునందలి యుష్ణము సహయించుకొనుటకై శీతల దేశముల కెందరో యరుగుచుండిరి. మరొకవంక వసంతఋతు వగుటచే తమ వినోదముల నేరుచోటుల ప్రదర్శింప సర్కసు వారును నాటక సమాజములవారును కానబడుచుండిరి. అవి యుపనయన వివాహ మహోత్సవ ముహూర్తకాలములు గాన మిగిలిన వారికంటె వీనికి చెందినవారు బండిలో నెక్కువగ నుండిరి. ఈ మహోత్సవములకు చేరిన వేశ్యాగణమును నచ్చ టచ్చట కనబట్టకపోవుటలేదు. వీరిద్దరు ముగ్గురున్న వీరివెంట యున్నారు మున్నూరు జనులుండక తప్పదు. రథోత్సవా దులు జయప్రదముగ జరిగినవని చెప్పుటకు వీరి ప్రత్యక్షమే ప్రబలప్రమాణము. ఇవి శృంగార లహరులు.

వేరొక వంక వీరఘట్టములు మాత్రము లేకపోలేదు. ఇందలి వారికి వీరరసమంతగా లేకున్నను, యౌవనము విజృం భించుటచే గుణము లుప్పొంగి అయ్యవి వాగ్రూపమున నెక్కు డుగ గనబట్టుచు, క్రియారూపమున మిక్కుటముగ మంద గించుచున్నవి. అది వారి దశాలక్షణము. వారు క్రీడావినోద ముల జట్టులుగ నేర్పడి యితరుల జట్టులతో పోటీ చేయుటకు పెద్దపెద్ద పట్టణములకు బోవుచుండిరి. ఈ వర్గమున విద్యార్థు

లెట్లు లేకుందురు? పరీక్షల క్లేశములనుండి విముక్తులగుటచే కొందరు విద్యార్థులు తమతమ గ్రామముల కరుగుచుండిరి. అందందు వివిధ దేశ దిదృక్షాపరాయణులును గలరు. ఇంకను నాకు గోచరము కానివారెందరుకలరో!

ఇందరిలో మా పెట్టెయందెక్కిన వారలు తమ అంత్య పరీక్షల పూర్తి కావించుకొని స్వగ్రామముల కేగుచుండిన విద్యార్థులు. మాపెట్టెయందెక్కిన వీరించుమించు పదునైదు మంది యుండవచ్చును. సైకిలుకట్టులవారు, సూట్లుబూట్ల వారు, కళ్ళజోడులవారు, కాళ్ళజోడులవారు, మాటకారి వారు, మౌనముదాల్చువారు, కూనిరాగములవారు, కొక్క రించువారు, సూక్ష్మదేహములవారు, స్థూలకాయములవారు, సిగరెట్లు కాల్చెడివారు, సెంట్లుదాల్చువారు, పొడవైన క్రాపింగులవారు, పొట్టి మీసాలవారు, జుబ్బా యిజారాలవారు, జాతీయ దుస్తులవారు, మూర్తీభవించిన తారుణ్యారాశి పగిది, ప్రకటీకృతమైన నవనాగరికత చాడ్పున మా పెట్టెయందు కలకలరవములతో ప్రవేశించి యందొక భాగమందు స్థల ముండుటచే వారివారి సూటుకేసులతోడను, క్యాంపుకాటుల తోడను, మాడరన్ బెడ్డింగ్సుతోడను, వచ్చి కూర్చుండిరి. కాని వెనువెంటనే వీరిలో కొందరు వీరులు మరల బండినుండి దిగి, బండి కదలెడు దనుక నటు నిటు విహారము సలుపుచు, బండికదలిన వెనుక నెక్కి యేదో ఘనకార్యముచేసినవారిభంగి లోలోన గర్వించుచు కూరుచుండిరి. ఒకరిద్దరు మాత్రము మెక్కుడుగా నలసియుండుటచేగాబోలు బల్లపై శయనించిరి. బండి బయలుదేరి, నోటినుండి పొగలు గ్రక్కుచు, కాకినాడ

క్షణములో చేరదలచినరీతి నడుగిడుచుండెను. అప్పుడుబల్లపై కూరుండిన విద్యార్థులలో నొకడు 'ఒరేయ్, భాస్కర్, రాజమండ్రి పొలిమేర దాటామట్రా?' అని వారి సంభాషణకంకురార్పణ చేసెను.

భా:- ఆ, దాటాముర్రా, బెడద వదిలిపోయింది. ఈ రాజమండ్రి మొఖము యింకా రెండునెలలు దాకా చూడనక్కరలేదు.

2 వి:- పరీక్షల హడావుడి అయిపోయిందిరా బాబు. ఇంక యింటికి చేరుకుందాం చల్లగా.

3 వి:- నీకేంలేరా బాగారాశావు పరీక్షలన్నీ. ఫస్టుక్లాసులో ప్యాసవుతావు. హాయిగా గడుపుతావు సెలవలు. మరినా బోటిగాడ్నో!... ... ...

4 వి:- అరేయ్ పరీక్షలు పరీక్షలే శలవలు శలవలేరా. పోనీ వాడు ఫస్టుక్లాసులో ప్యాసైతే మనము ఫోర్తుక్లాసులో నన్నా ప్యాసుకామట్రా?

3 వి:- ఫోర్తుక్లాసేమిట్రా నీ మొహం!

5 వి:- తప్పటమన్నమాట, పుల్లాయ్, అంతమాత్రం తెలుసుకోలేవు? పైగా యింటరు చదువుతున్నావు!

3 వి:- అవునులేరా? ఆప్యాసయ్యే వాళ్ళంతా తప్పలేకేగదరా ప్యాసవుతున్నారు! మళ్ళా మాట్లాడితే వాళ్ళు మనకు మల్లే తప్పగలరా చెప్పు.

4 వి:- మనకున్న ఓపిక మనకున్న అనుభవం ఆ ప్యాసయ్యే వాళ్ళ కెక్కడుందిరా? ప్రతిక్లాసు బుడిగిబుడిగి ప్యాసై పోతూఉంటారు. మనంచూడు దెబ్బమరి, నాలుగేళ్ళు

యింటరులో పీకమేసుకు కూర్చున్నాం. చూడు మన ముందర యెంతమంది లెక్చరర్లు మారిపోయినారో! ఎంత మంది పిన్సిపాలులు మారిపోయినారో! అరేయ్ నాగభూషణం రేపు బియ్యేలోకి పోతున్నాడుగదా, వాడిని రాజమండ్రిలో సారంగధర మెట్ట యెక్కడుందో చెప్పమనరా చూద్దాం. వాడికి పుస్తకాలుభట్టీవేసి ప్యాసయ్యే తెలివే గాని ప్రపంచజ్ఞానము లేనేలేదురా. వాడికి కోపమువస్తే రానీలే పరవాలేదు

నా:- ఏడిశావులేరా! మహా నీకు ప్రపంచజ్ఞానముందిలే.

5 వి:- అవునులేరా, గోపాయ్ నీగొడవ. బండిలో నన్నా నీ బడాయి మాటలు మానావుకావు. పరీక్షలైపోయినా ఇంకా ఆ గొడవెందుకురా! ఏదిరా భాస్కర్! ఒకపద్యం పాడరా హాయిగా.

భా:- ఇప్పుడెందుకులేరా బండిలో.

5 వి:- ఏం బండైతే? గొంతు కడ్డమొస్తుందా! పాడవోయ్, తెగనీలగక, పాడేవాళ్ళ కెప్పుడు యిదే బెట్టు.

భా:- ఏం పాడనురా యిప్పుడు?

2 వి:- ఏదీ కళ్యాణిలో పాడుతావే పద్యం, అది కానియ్యరా ఒకసారి.

3 వి:- సైలెన్సు ప్లీజ్.

భా:- సీ॥ ఆచరణములేని యోచనాచాతురి
నీటవ్రాసినభంగి నిష్ఫలంబు,
ఆదర్శరహితమైనట్టి సద్బోధన
రూపింప కాంతార రోదనంబు,

క్రౌర్యదీక్షయె లేని గంభీరగర్జన
చిత్తచంచలుని విజృంభణంబు,
సత్కర్మశూన్యమౌ సకలసుజ్ఞానంబు
వ్యర్థంబు ప్రబల యనర్థకంబు,

గీ॥ కాన యాచరణము మహాఘనతరంబు
నుత్తమంబగు గావున చిత్తశుద్ధి
గల్గి, సద్ధర్మములసల్పి, కడువివేక
వంతులగుచు కృతార్థత బడయవలదె?

4 వి:- ఏమిరోయ్ అంతకంతకు యింకా కళ్యాణిలో రిసెర్చి వర్కు చేస్తున్నావు! ఎక్కడ పట్టావేంటి యీ కళలు?

భా:- ఏమిటోలేరా.

3 వి: ఉండండిరా, గోపాల్ పాడుతాడు.

గో:- వేళాకోళం ఆడుతున్నావేంరోయ్! నేపాడానంటే గాడిదలు పరుగెత్తుకొస్తాయి జాగర్త!

2 వి:- నీవు పాడరా శ్రీహరి.

శ్రీహరి:- ఏం పాడనురా యిప్పుడు! గొంతుక బాగాలేదురా.

4 వి:- పరవాలేదులేవోయ్. నీ కిప్పుడు మొదల్లిచ్చేవాళ్ళె వరులేరు. ఏది? ఆ 'జవ్వనంబున' అనేపద్యంపాడు.

శ్రీహరి:-

సీ॥ జవ్వనంబున యథేచ్ఛగ చరించుట కాదు
వృద్ధులౌతరి బాధలెరుగవలయు,
కలవాడనని దుండగము లొనర్చుటయెకా
దుగ్రమౌ యమబాధ లోర్వవలయు,

వాగ్దానముల నిచ్చువచ్చినట్లొసగుట
కాదు తత్వాలన గసగవలయు,
బహువిధసిద్ధాంత భావనాధోరణి
కా దనుష్ఠాన కంకణము వలయు,

సీ॥ సోదరా, నీదుపూర్వోత్తరాదులెల్ల
నించుకంతభావించి యోచించుకొనుమ,
మరువకెన్నడు నీవర్తమాన భూత
భావిదశలెల్ల; సుజ్ఞానివగుచు మనుమ.

4 వి:- నీకేమీ గ్రామఫోను పాటలు రావుట్రా?
2 వి:- గ్రామఫోను పాట లెందుకురా? విని విని విసుగు పుట్టిం
ది. పాడనీ వాడి స్వంత పద్యాలే.
5 వి:- అరేయ్, యేది డిగ్నిటి ఆఫ్ లేబర్ మీాద చెప్పాడే
డాక్టరు సింహాచలం, అది పాడరా ఒకసారి భగవాన్!
భ:- ఉండరా యీా సిగిరెట్టు కానీ పాడుతా.
5 వి:- అయితే సరేగాని, యీాలోగా నీఫేవరిట్ సాంగ్
పాడరా భాస్కర్.
భా:- ఏమిట్రా అది.?
5 వి:- అదిరా... అది... ఏమిటంటే... వందే వందే.
భా:- ఓహో అదా? ఏంబాగుందిరా అది?
5 వి:- బాగుందిలే పాడవోయ్; నీకుకాదు బాగుండాలిసింది.
నాకు.

(వందే వందే భారతమాత వలె)
వందే వందే భారతజననీ ॥వం॥
1. భారత జననీ భాసుర హాసిని

పాపవిదారిణి పరమపావనీ
శ్యామలవేణీ కోమలవాణీ
జగతీరాణీ వితరణపాణీ
వరప్రదాయిని భారతజననీ॥ ॥వం॥

2. హిందూ ముస్లిం క్రైస్తవమాత
జైన పారసిక బౌద్ధప్రపూత
సకలశాస్త్ర విజ్ఞానసమేత
ధీరవీర సుకుమార విధాత
నమో నమో జయ భారతమాత॥ ॥వం॥

3. మాతా మముదయ బోధవగదమ్మా
పాపకార్యములు మానుదుమమ్మా
సర్వతోముఖాభ్యుదయమునిమ్మా
భువనసేవయే పూనెదమమ్మా
అమ్మా దీన లిమ్మా రవమ్మా ॥వం॥

4 వి:- స్ప్లెండిడ్.

6 వి:- ఒరేయ్ భగవాన్! చాలుగాని యింక ఆ సిగరెట్టు పారేసి పాడరా ఒక పద్యం.

భ:- ఏం పాడనురా?

5 వి:- ఆ డిగ్నిటీ ఆఫ్ లేబర్ మీద పద్యం పాడరా?

సీ॥ ఇలతన తనయునిమలమూత్రముల ముట్ట
తల్లి నీచమటంచు దలచునొక్కొ?
తనదారసుతుల యథాశక్తి పోషింప
భారమంచునుతండ్రి వదలునొక్కొ?
సర్వసద్వృత్తులు సలుపకున్నను జగ
న్నాటక మేరీతి నడచునొక్కొ?

ఎవ్వరిపని వార లింపుగా నొనరింప
గౌరవలోపంబు కలుగగలదా?

సీ॥ అవనిగలయట్టి వృత్తులయందు భిన్న
భావములువీడి, భువనశుభంబుగొల్పు
సర్వసద్వృత్తులను మీరు సామ్యదృష్టి
నాసరింపుడి బుధులార! ఆర్యులార!

5 వి:- వెరీగుడ్.

భః- ఇంకా గొంతు బాగాలేదురా.

7 వి:- అరేయ్ డిగ్నిటీ ఆఫ్ లేబర్ అంటే జ్ఞాపకమువచ్చింది. మీరంతా ఆనాడు మిస్ కూపర్ లెక్చరు విన్నారు కాదురా? అ లెక్చరును గురించి మీ అభిప్రాయ మేమిటిరా

8 వి:- నాకుమాత్రం బాగానేవుంది. ఆ అభిప్రాయాలు చాలా నవీనంగా ఉన్నాయిరా.

2 వి:- ఏం చెప్పిందిరా? నేను వినలేదు అవ్వాళ్ల.

8 వి:- ఏముందిరా, అవ్వాళ్ళ విద్యార్థుల ధర్మములను గురించి మాట్లాడింది. అందులో మన చదువులు మనం బాగా చదువుకుంటూ, కాలేజీ వ్యవహారాలలో కూడ పాల్గొనాలనీ, మనమంతా భావిపౌరులము గనుక ప్రపంచ పరిస్థితులన్నీ బాగా యిప్పటినుంచి తెలుసుకోవలెననీ, మనచదువు పూర్తి ఆయ్యేదాక మనం యెటువంటి లోక వ్యవహారములలోను పాల్గొని చదువుకు భంగం కలిగించు కోరాదనీ యేవో మరీ ముఖ్యమైన విషయములలో తప్ప యితరులవలె ప్రతి స్వల్ప విషయానికీ మనము

సమ్మెలు చేయరాదనీ, అటువంటి ఆందోళనలన్నీ పెద్ద వారికి వదిలేసి వారిద్వారా నిజమైన కష్టాలు తొలగించుకో వలసినదనీ చెప్పింది. ఇంకా విద్యార్థులు సర్వవిధముల లోకమునకు ఆదర్శప్రాయులుగా ఉండాలని నీన్నీ చెప్పిందిరా.

2 వి:- అయితే మనం స్వల్పవిషయాలలో సమ్మెచేయకూడదన్నమాట, అంతేనా?

8 వి:- అవును, చేయకూడదు. ఆమె చెప్పినమాట నిజమేనని తోస్తోంది నాకుకూడ. మన దేశనాయకులుకూడ చాలమంది అదే చెప్పుతున్నారు.

7 వి:- అయితే లోక వ్యవహారములలో పాల్గొనకూడదంటే యెల్లా మరి?

8 వి:- ఎల్లాగంటావా? మన విద్యార్థి దశలో మనము చదువుకొని ప్రపంచములోని సర్వ విషయములు చేతనైనంత వరకు తెలుసుకోవటమే మన పని. అల్లాకాకుండా లోక ఇతరవ్యవహారాలలో జోక్యం కలుగ జేసుకున్నామా, మన చదువులు చెడిపోతాయి. దానివలన ప్రపంచజ్ఞానము పొందే అవకాశము మనకు లేకుండాపోతుంది. అందుచేత ప్రత్యక్షంగా జీవితములోకి ప్రవేశించేటప్పటికి తెలిసీ తెలియని వారుగా తయారవుతాము. కాబట్టి విద్యార్థిదశలోనే మనం అన్నివ్యవహారాలలో—అంటే రాజకీయ సాంఘిక మత వ్యవహారములలోను, చదువును చెడగొట్టే యితర వ్యవహారములలోను—జోక్యం కలుగ జేసుకోరాదు. దానికి వేరే కాలముంది. అదే గృహస్థాశ్రమం. నిజంగా

విద్యార్థిదశ మనకు రాబోయే కార్యపూరితమైనజీవనానికి తయారుకావలసిన కాలమన్నమాట.

9 వి:- ఆదేనోయ్, ఈ విషయాలన్నీ బాగా అర్థం చేసుకో లేక మనలో చాలమంది వాళ్ళ చదువులుకూడ సరిగా చదువుకోనక కాలము ధనము వృథాపుచ్చుతూ 'మనము భావికాలపు పౌరులము, మనమీాదనే భావిభారత భాగ్యో దయము ఆధారపడిఉన్నది. కాబట్టి మనము ఆదర్శ పాత్రియులుగా తయారుకావాలి,' అనే ఉత్సాహముకూడ లేకుండా చెడిపోతున్నారు. ఆలోచిస్తే యిది నిజంగా మిక్కిలి శోచనీయ మని చెప్పకతప్పదు.

3 వి:- చాలూలేరా వాసూ, యిప్పుడు మొదలుపెట్టావేంటి నీ ఉపన్యాసం, ఏదోబండిలో కాసేపు కులాసాగా కాలం గడపక ! ఆ ఆడది చెప్పినమాటలకేంటో అంత వ్యాఖ్యా నం చేస్తున్నావేంటి ?

5 వి:- ఏమిరోయ్, ఆడవాళ్ళంటే అంత చులకనగా ఉందా యేమిటి నీకు ? సరే ఉండు చెప్తాలే.

4 వి:- అరేయ్, సామన్లకోటవస్తోంది. నీవు భగవాన్ ఇక్కడే దిగిపోతారు గావును. ఏదిరా అయితే చివరపాటభాస్కర్, రంయ్ మంటో పోవాలి గాత్రం.

(దేవుని మహిమా తెలియగ వశమా వలె)

భా:- ఈశ్వరు మహిమా ఎఱుగగ తరమా
పాపుల కీ భువిలో ||ఈ||

1. కన్నులు తెఱచీ కలుషము విడచీ
కామితవరదున్ గనరా జీవా ||ఈ||

2. మాయజలధిలో పడబోకుమురా
వనితాలోలుడవై సిరులకై
పాపముచేయకురా
కుమతివై నీతిని వీడకురా
దేవునికనులన్ మాయగవశమా
యమదండన తప్పదురా మూఢా ॥ఈ॥

3. ధనధాన్యములున్ దారాసుతులున్
శాశ్వతమని తలపకురా జీవా
మానవసేవయె మాధవసేవని
ఎరిగి చరింపుమురా జీవా ॥ ॥ఈ॥

భ:- ప్రేమను వచ్చిందిరోయ్ భాస్కరం!

భా:- గుడ్-బై, ఉత్తరాలు మాత్రం అప్పుడప్పుడు రాస్తో ఉండండిరాబాబు మరచిపోక. మా యిద్దరి అడ్రసులు నంబర్లుతీసుకున్నారుగామీరు? మీవిమాదగ్గరున్నాయిలే.

4 వి:- ఆ, తీసుకున్నాంలే.

భ:- సరే. good-bye to all, వస్తామింక, బండి కదులుతోంది.

అందరు:- Good - bye భగవాన్ and భాస్కర్.

# సమాప్తి వచనములు

ప్రపంచ వృద్ధిక్షయంబులు రెంటియందే ఆధారపడి యున్నవి. మొదటిది సత్వరజస్తమోగుణసమన్వితస్త్రీ. కృషీవలుడు రెండవవాడు. జీవులజన్మమున కాధారభూతమై లాలన పోషణంబులకు పట్టుకొమ్మయై యుండునది స్త్రీ. జీవనాధార

మున కాధార పురుషుడు కృషీవలుడే. ఈతత్వమును మనలో ననేకులు తెలియకున్నారు.

స్త్రీ ఔన్నత్యమును పవిత్రతను ప్రేమను యెట్లు పో షించుచున్నారో ఆ త్రిమూర్తులు! కృషీవలుని ఆధిక్యతనింకె వ్వరు చాటవలయు పోతనామాత్యుడుండ ? తక్కినవారెవ్వ రాతనికి కానరాకుండిరే? తక్కిన జీవనమాతని కచ్చకున్నే ? అపరసృష్టికర్తయగు ఆపోతన కృషీవలుని జీవనమేల యెన్ను కొనెను? 'అదివినామరొకటివహి' అని యెదిరించి తత్వమును వెలిబుచ్చి తనజీవనమును కొనసాగించుకొనెనుకదా! కాని యీ కృ షీ వ లు ని పరిస్థితులు ఒక్కొక్కప్పుడు మిక్కిలి శోచనీయములుగ నున్నవి. కావుననే మహానుభావు లచ్చట చ్చట యుద్భవించి వీనినుద్ధరింప కృషిచేయుచున్నారు. లోక మునకు వెన్నెముకయైన వీని యజ్ఞానమును గాంచ నేరికైన మనసు కరుగకుండునా?

సామర్లకోటలో బండి ఆగినవెంటనే ఒకపల్లెటూరి వృద్ధుడు మాపెట్టెలో నెక్కెను. బండి కదిలినపిమ్మటనాతడు కొంతవడి ఆవిద్యార్థులలో నొకనివంక చూచుచు కూర్చుం డెను. తదుపరి యేమయ్యెను?

వృ:– నాయనా, మరి,నీవు నాయుడుగారి అబ్బాయివికాదూ?
వి:– అవును.
వృ:– అయితే యిప్పుడెక్కడుంటున్నావు నాయనా?
వి:– రాజమండ్రిలో.
వృ:– ఏం చేస్తున్నావేంటి అక్కడ?
వి:– చదువుకుంటున్నా.

వృ:- ఏం చదువుకుంటున్నావు బాబూ?

వి:- బి. ఎ.

వృ:- ఊం, బి. ఎ. దాకా సదివావ్! అయితే యిప్పుడు మీ నాన్నగారికంటే యెక్కువే సదివావన్నమాటేగా?

వి:- ఆ

వృ:- అయితే మీనాన్నగారికంటే పెద్దుద్దేగమే వత్తుందన్నమాటే?

వి:- ఆ

వృ:- అయితే మీ నా న్న గా రి కే మునసబ్బైతే నీకు బి. ఎ. ప్యాసవడంతోటే కలకటేరు పనిత్తారన్నమాటే తప్పకుండ.

వి:- ఓ! యిస్తారు.

వృ:- అయితే కలకటేరు అయినదానిమీద కావాలంటే అప్పుడప్పుడు యింజినీరు పనికూడ చెయ్యొచ్చుగా?

వి:- చెయ్యొచ్చును.

2 వి:- What is it you are boasting, man?

వి:- I say, you keep quiet for sometime.

వృ:- అయితే అబ్బాయీ! నీ విప్పుడు మాట్లాడింది యింగిలీచేనా?

వి:- అవును.

వృ:- ఊం, బాగానే మాట్లాడుతున్నావన్నమాట! అయితే నీవు పీడరు కావాలన్నా కావచ్చుగా?

వి:- ఆ.

వృ:- ముందు కలకటేరయి....... అక్కడనుంచి కొన్నాళ్ళు

యింజనీరుగాను కొన్నాళ్లు పీడరుగ్గాను, రా. బాగా డబ్బొ
త్తుంది.

వి:- అల్లాగే.

వృ:- అయితే అడ్డగడం మూరిచేపోయ్యా, బోర్డుప్రెసిడెంటుగా కూడ రావచ్చుగా?

వి:- ఆ రావచ్చు.

వృ:- అయితే నీవు మనజిల్లాకి ప్రెసిడెంటైతే బాగుంటుం దబ్బాయి, యేమంటావ్? నీకుకూడా దానిమీదే ఉందా మనస్సు? మీనాన్నగారు చెప్పుతారులే బాగా. నీవుదానికే సరిపోతావు. తెలిసిందా! నీవు శాలా బుద్ధిమంతుడివి కూడాను.

శ్రీ:-(తాను చదువుచున్న పుస్తకము మూసి) నాయనా! పామర్యుడైన ఆవృద్ధునితోనా నీ సరసములు! who is that man?

వి:-(విస్మయముతో) He is the tenant of our land.

వృ:-(శ్రీధరరావుగారితో) ఏదో లెండి బాబు, నేను వీళ్ళనాన్న గారిని యెరుగుదును. అందుకని మాట్లాడుతుండా ఆ అబ్బాయితో. నేనిందాకటినుంచి అన్నమాటల్లో యే మన్నా తప్పుంటే క్షమించండి బాబు, తెలియకన్నాను గాని!

శ్రీ:- అబ్బే, నీలో యేమీ తప్పులేదు. ఆయన నంటున్నాను.

వృ:- ఆ అబ్బాయి మా నాయుడుగారి అబ్బాయేలెండి.

శ్రీ:- (మాతో) చూశారా అండీ యెల్లాఉందో యీవృద్ధుని వ్యవహారం! ఇటువంటివాళ్లు మనదేశములో ఇంకా ఉన్నారు. బీదవాళ్లుఅవటంచేతపగ లంతా పనిచేస్తే నేగాని

వీళ్ళకు పొట్టగడవదు. చిన్నప్పటినుండి యేదోఒకపనిలో పడి కొట్టుకోవటంచేత వీళ్ళకు ఓనమాలు చదువుకోటానికి కూడ అవకాశముండదు.

ప్రి:- అవునండీ పంతులుగారూ! మన దేశములో నిరక్షరు లున్న మాటనిజమే, కాని వీళ్ళందరినీ జ్ఞానవంతులుగా చేయాలంటే యింతమందికి స్కూళ్లెక్కడ పెడతామండీ? వీళ్లేమి ఒకళ్ళా యిద్దరా?

శ్రీ:- ఆలోచిస్తే యీ కృషీవలు లందరిని జ్ఞానవంతులుగా చేయడానికి మార్గాలు లేకపోలేదు.

సీ॥ పవలెల్ల జీవనోపాధి నార్జించు పే
దలకు రాత్రుల బోధ సలుపవలయు,
పామరులగు నెల్లప్రజల బిడ్డలకును
నుచితవిద్యాభ్యాస మొసగవలయు,
వలయు పరిశ్రమ లలవడుటకు పరి
శ్రమగూర్చు విద్య లొసంగవలయు,
శ్రావ్యదృశ్యప్రదర్శనముల లోకపు
జ్ఞానము నొసగంగ పూనవలయు;

గీ॥ పేదలకు నెల్లవిధముల విద్యనొసగి,
రాజకీయసాంఘిక సారస్వతాది
సర్వసుజ్ఞానము నొసంగి, సక్రమముగ
ప్రజలలో పామరత్వంబు బాపవలయు॥

ప్రి:- అలా ఆయితే పరవాలేదులేండి. వాళ్ళ జీవనోపాధి చూచుకోవచ్చు. అది అలా ఉండగా, యీ రోజులలో విద్యావిధానముకూడ అంత బాగా లేదులేండి.

శ్రీ:- అవును.

2 ప్ర:- మీ రెంతవరకు వెళ్ళుతున్నారు పంతులుగారు ?
శ్రీ:- విశాఖపట్టణం. మీరు?
2 ప్ర:- నేను తునికి వెళ్ళుతున్నాను. నేను యీదినము అదృష్టమువలన మీతో నేరుగ బెజవాడనుంచి ప్రయాణంచేసి ఉండడంచేత కొత్త విషయములు చాలా నేర్చుకున్నాను. దీనికి చాలా కృతజ్ఞుడను.
శ్రీ:- మీ స్వగ్రామమేది ?
2 ప్ర:- మాది చిత్తూరుజిల్లా వాయిలపాడు గ్రామం. నాది ఒక మనవిఉన్నది పంతులుగారు.
శ్రీ:- ఏమిటది?
2 ప్ర:- బెజవాడనుండి మొదలు మీరు, ఒక స్వాములవారు, యింకా వేరే ప్రయాణీకులు కొందరు చెప్పిన ఉపదేశములు పామరులకుకూడ సుబోధకములై యున్నవి. నిజముగా యీ దినములలో పామరజనవిద్యాప్రచారము నిమిత్తము యిటువంటి విషయములే మనకు చాలా అవసరముగా ఉంటూ ఉన్నవి. అందుచేత యెవరైన యీ సదుపదేశములన్నీ చేర్చి పద్యములుగా సులభశైలిలో వ్రాసి ఆపద్యాలను యెవరైన గాయకులు గ్రామఫోను రికార్డులలో మధురముగాను సువ్యక్తముగానుపాడితే అవి పామరజనాకర్షణీయముగ ఉండి వారి జ్ఞానాభివృద్ధికి సంఘాభివృద్ధికి యెక్కువగా తోడ్పడగలవు. కాబట్టి యీ రీతిగా మీరు చేయించినట్లయితే పామరజనులకు శాశ్వతమైన సేవచేసినవారగుదురు. ఇటువంటి కార్యములు చేయించుటకు మీవంటి పెద్దవారికి కష్టముకాదు.
శ్రీ:- ఓహో! అది మంచిపనేగాని యితరులు చెప్పిన విష

యాలన్నీ నేనంతబాగా జ్ఞాపకముంచుకోలేదే. అదీగాక
ఆ స్వాములవారు చెప్పిన విషయాలను నేనసలు విని
లేదు కూడాను.

నేను:- అయ్యా, దీనికి సంబంధించిన రచన చేయమంటే నేను
చేస్తాను.

2 ప్ర:- అయితే ఒక పనిచేయండి. మీరుకూడ బెజవాడ
నుంచివస్తున్నారు కాబట్టి అక్కడనుంచి జరిగిఉండిన ప్రయాణమునే కథగా తీసుకొని మీరు వినినది చూచినది
అంతా వ్రాయండి.

నేను:- అల్లాగే.

శ్రీ:- అయితే మీ అభిప్రాయం త్వరలోనే కార్యరూపం
దాలుస్తుంది. మన సంఘము దినదినప్రవర్ధమానమగుచు
దురాచారములు మాని సదాచారములు పూని లోకము
నకు మేల్బంతి కావలెనని మన కోరిక.

2 ప్ర:- చిత్తము, పోయివస్తాను, మా ఊరువచ్చింది.

శ్రీ:- మంచిది, ఏ ఊరు?

2 ప్ర:- తుని.

నేను:- నేను కూడ సెలవు పుచ్చుకుంటాను.

శ్రీ:- ఓహో! మీరుకూడ యిక్కడే దిగుతారా!

నేను:- చిత్తం, సెలవు.

శ్రీ:- మంచిది, వెళ్లిరండి.

శ్రీస్వామిని సెలవు కైకొనునంతలో బండి నిలుచుటయు, మరికొంత రెక్కటియు జరిగెను. అంతట మేము దిగితిమి. అనతికాలములోనే మాకు బంధుదర్శనమయ్యెను. సెలవు!

జై హింద్!

# తప్పొప్పుల పట్టిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 8 | పరుత్నావు | పరున్నావు |
| 4 | 11 | దంబీ | వండీ |
| 6 | 15 | పట్టణందాశా | పట్టణందాకా. మీరు? |
| 8 | 11 | నవుడే | నపుడే |
| 8 | 19 | సంఘోద్ఘణ | సంఘోద్ధరణ |
| 17 | 24 | నందేహము | సందేహము |
| 22 | 19 | గాంచినాడు | గావించినాడు |
| 26 | 2 | రువది | ఇరువది |
| 26 | 3 | ఇదా | కదా |
| 27 | 13 | i | it |
| 40 | 14 | చేత | చేతగాని |
| 58 | 14 | దిన | దీవన |
| 60 | 15 | లోక | — |
| 61 | 8 | కావాలి, | కావాలి? |
| 61 | 11 | చాలూ | చాలు |

